ఓం

శ్రీ గణేశాయనమః

# మంత్రానుష్ఠాన మహిమ

ప్రజ్ఞానంబ్రహ్మ 




తత్త్వమసి


ప్రచురణకర్త:

## శ్రీ ఆత్మానంద బ్రహ్మచారి

పలాస




[మూల్యం రు. 1/-




ప్రతులు ౧౦౦౦

వికారినామ సంవత్సర

శ్రావణ బహుళ దశమి

౧౯౫౯

శ్రీ గణేశాయనమః

# విజ్ఞాపనము

ఆర్యులారా!

నాకు బాల్యమునుండియు మాతాపితరులయం దధికభక్తిగలదు, కాని వారు లౌకికులగుటచే వారి యుపదేశానుసారముగా నాచరింప నేరనైతిని. నాకు మొదటినుండియు బ్రహ్మచర్యవ్రతాలంబనమందభిరుచి మెండుగా నుండెడిది. నిర్జనప్రదేశము లభించినపుడు సర్వాంతర్యామియైన సర్వేశ్వరుని అద్భుతశక్తులను స్మరించుచు విస్మితాంతఃకరణుఁడనగు చుండెడివాఁడను గృహమునందుంటకు నిచ్ఛలేక పూర్వజన్మసంస్కారముననో, సర్వేశ్వరానుగ్రహముననో, సత్పురుషుల యాశీఃప్రభావముచేతనో కాశ్యాది పుణ్యక్షేత్రముల కేఁగి మహాత్ములను సందర్శించి, వారిసేవగావించి కృతార్థుఁడను గావలెనను సంకల్పముతో నొక దివసము ననుమఃకాలమున తలిదండ్రులకు నమస్కరించి పుణ్యక్షేత్రములు దర్శింపఁబయనమైతిని. వారణాసీక్షేత్ర శివదర్శన సేవనములనొకవత్సరము గడపితిని.

పిమ్మట 1938 సంవత్సరమున బ్రహ్మచర్యదీక్ష గైకొంటిని. 1942 వ సంవత్సరమువఱకు ఆశీతాచల సేతుపర్యంతముండిన సర్వక్షేత్రములను దర్శించితిని. ఇవియవియననేల? పెద్దపెద్ద నగరములు జీవనదులు - తీర్థస్థానములను సేవించితిని. కొన్నాళ్లు క్షారలవణత్యక్తమైన అన్నమునుభుజించియు, కొన్నిదినములు నిరశనమునను, కొన్నాళ్లు వివిధసస్యాన్నమును దినుచు, యథాప్రాప్త సంతృప్తుఁడనై - కైలాసాది సమస్తతీర్థములను దర్శించి, తిరిగి కాశీక్షేత్రమునకుఁ జేరితిని. ఇతర మతసంప్రదాయకులకుగాని, గృహస్థులకుగాని శ్రమ గల్గింపక, మధుకరవృత్తి చేసికొనుచు సన్న్యాసిపాఠశాలలో బ్రహ్మ

విద్యా పాఠశాలలో అధ్యయనము, ఆఱు సంవత్సరములు కొన్ని సంస్కృత భాషా వేదాంత గ్రంథపఠనము లభ్యసించితిని. గురుకులములో సంస్కృతభాష నేర్చితిని. ఇట్లు స్నాన, సంధ్యాభగవదారాధనాధ్యానాపనయోగాది సాధనల నాచరించుచుండెడివాఁడను. విద్యాభ్యాసానంతరము యజ్ఞయాగాదులుచేయించుట, భగవద్గీతోపన్యాసము లిచ్చుచు కొన్నాళ్లు గడపుచు వచ్చితిని.

"గురూపదేశ ప్రశ్నోత్తరమణిరత్నమాల" యను 600 పేజీలు గల గ్రంథమును రచించితిని. ఈవిధముగాఁ బదియేండ్లు జీవితయాత్ర చేసితిని. అప్పటికినంతఃకరణ చతుష్టయము, ప్రజ్ఞకు స్వాధీనము కానందునఁ బరితపించుచు, లోకకల్యాణార్థమై యేమానవునకు ప్రజ్ఞ స్వాధీనములోనుండదో వారు చెప్పిన విషయములు నిష్ప్రయోజనము లందురు. దానినేశుష్కవేదాంతమందురు. కావునఁ దీనికిదగినయౌషధ మేమని నాలో నేనాలోచించితిని. సమస్తమునకుఁ బరమాత్మునిశక్తియే కారణమని యెంచి, కాన్పూరుపట్టణమునకు సమీపముననున్న పరమేశ్వరుని ఆమలకవృక్షచ్ఛాయలక్రిందను గంగాతీరమందలి నుపాసించుచు, మౌనవ్రతధారినై, స్వయంపాకము చేసికొని, మితసాత్వికాహారమును గైకొనుచు, ప్రతిదినము రుద్రగాయత్రీజపము 700. చొప్పున 1955 సం॥రమున ప్రారంభించి, యేకదీక్షగా బదిమూఁడు మాసములు, 2600000, యిరువది యాఱులక్షలు, రుద్రగాయత్రీ జపము సేయుచు నంతఃకరణవృత్తి ప్రజ్ఞ స్వాధీనములోనుండుటకు, సకామోపాసన చేసితిని ఈ యుపాసనయందుండునపుడు ప్రజ్ఞానుభవమునకు వచ్చిన విషయములు లోకమునకు తెలియపరచుటకు నీ "మంత్రానుష్ఠాన మహిమ" యను గ్రంథమును సర్వజనులు తరించుటకు, ననుభవించుటకు సులభశైలిని వ్రాసితిని. ఈ గ్రంథమునందు గుణదోషము లుండవచ్చును. ఇందలి విషయసర్వస్వము భగవంతునిది. దోష

జాలము నాయది. ఓ పాఠకమహాశయులారా !! యీ గ్రంథములోని మంచి విషయములను గ్రహించి, నాస్వల్పకృషిని ప్రోత్సహింతురుగాక !!

సర్వేజనాస్సుఖినోభవన్తు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

# అభిప్రాయము

పవిత్రగంగాతీరమున సుమారొకవత్సరమునుండి — స్వజనులు — స్వధనము - సహాయసంపత్తిలేని కమూల్గంజ్ గ్రామసీమలో రుద్ర గాయత్రీవ్రతానుష్ఠానమును శ్రీ ఆత్మానంద బ్రహ్మచారిగారు పూర్తి చేసినారు. ఆసమయమునందే వీరిమనోకాశములో — ఆధ్యాత్మికవిహారములో స్ఫురించిన భావశంపాలతలే యీ మంత్రానుష్ఠానపుస్తక రూపముగా నవతరించినది. సుమారు 22 యేండ్లనుండి బ్రహ్మచర్య దీక్షనతికఠోరముగా సాధించుచుండుటయేగాక — ఆబాల్యమ్ముగా పురాసుకృతలబ్ధమైన వీరిసుచిరవైరాగ్యసంపత్తి భారతీయ సంయమీంద్రప్రతిభను వెల్లడించుచున్నది. వన్యమధువుల సేకరించి నలువాడలు సంచరించి విజ్ఞానమధుకోశము లోకోపకారమునకై సిద్ధపఱచు వీరి పరిశ్రమ నిష్కామమేగాని సకామముగాదు. వీరి ప్రసిద్ధానుభవ వేదాంతవిమల చంద్రకలింతకుఁ బూర్వమే యంతట వ్యాపించినవి — ఇంకను విస్తరింపనున్నవి. వారికోరికపై వారిభావాలకొక శైలిని కల్పించి స్వధర్మమును బూర్తిచేసికొంటిని. రసజ్ఞులీ విజ్ఞానామృతమును తనివోవ నాస్వాదింతురుగాక.

18 - 8 - 59 }
రాజమండ్రి }

చేబోలు చిన్మయబ్రహ్మకవి
మధురకవి, భాషాప్రవీణ కవితావిభూషణ, స్వర్ణసింహకంకణ

# చందాదారులయొక్క పట్టిక

| | | |
|---|---|---|
| 1 | శ్రీ సత్యానంద భక్తమండలివారు యిచ్చిన పైకము— బొంబాయి | రు. 116- |
| 2 | గ్రంధి లక్ష్మీనారాయణ శ్రేష్ఠిగారు - రాజమండ్రి | 58- |
| 3 | జమ్ముల శరణిరాజుగారు - బరంపురం | 50- |
| 4 | కొత్తూరు రామయ్య. కస్తూరపు రామకృష్ణయ్యగారు- గుంటూరు | 50- |
| 5 | గ్రంధి వెంకటసుబ్బారావుగారు - రాజమండ్రి | 30- |
| 6 | సి. యస్. నాగరాజుగారు - బెంగుళూరు | 30- |
| 7 | తుమ్మలపెంట సుబ్రాయులుగారు - మద్రాసు | 30- |
| 8 | శిల్లా భీమరాజుగారు - బరంపురం | 25- |
| 9 | సమయమంతుల నాగేశ్వరరావుగారు - ర్యాలి | 25- |
| 10 | సిదరా మర్యాసులు శ్రేష్ఠిగారు - సికింద్రాబాద్ | 25- |
| 11 | రాజనల్లి రామయ్యగారు - దావనగిరి | 25- |
| 12 | యూదాళం సుబ్బయ్యశ్రేష్ఠిగారు - బెంగుళూరు | 25- |
| 13 | పి. యె. రామశ్రేష్ఠిగారు - కోయంబత్తూరు | 25- |
| 14 | జమ్ముల శ్రీరంగశ్రేష్ఠిగారు - బరంపురం | 20- |
| 15 | పోరిశెట్టి సోమసుందరంగారు - గుంటూరు | 20- |
| 16 | కోణంకి అమ్మినాయుడుగారు - ఉరజాం | 16- |
| 17 | పొట్నూరు చిన్నవీరభద్రస్వామిగారు - నరసన్నపేట | 15- |
| 18 | కోరంగి వీరరాజుగారు - రాజమండ్రి | 15- |
| 19 | వెంప్పటి బుచ్చయ్యగారు - సూర్యాపేట | 15- |
| 20 | బూరగ మహాదేవ్ శ్రేష్ఠిగారు - సికింద్రాబాద్ | 15- |

| | |
|---|---|
| 21 బిరుకూరు శంకరయ్యగారు - శికింద్రాబాద్ | 15- |
| 22 కె. కె. సంజీవమూర్తిగారు - కొల్లేగాలం | 15_ |
| 23 శ్రీ కన్యకా పరమేశ్వరి దేవస్థానంవారు - సత్యమంగళం | 15- |
| 24 పొడుగు బాలచంద్రుడుగారు - వారణాసి | 11-50 |
| 25 కెంగువ వెంకన్నగారు - ఉక్కుంబ | 11-50 |
| 26 సి. యస్. కృష్ణమూర్తిగారు - బెంగుళూరు | 11- |
| 27 లాడి సన్యాసిగారు - గుడారి | 10- |
| 28 గుడ్ల రఘురాములుగారు - కొటికనాడ | 10- |
| 29 కొత్తకోట నారాయణ కుమందాన్ - రాయగడ | 10- |
| 30 శ్రీపాపనయోగిగారు - వెదుళ్ళవలస | 10- |
| 31 గుడ్ల కృష్ణమూర్తిగారు - వెదుళ్ళవలస | 10- |
| 32 నారాయణ శూరోహరిచందనదేవ్ - తర్లాకోట | 10_ |
| 33 ఉప్పల పెద్దవెంకటరమణశ్రేష్ఠిగారు - అనకాపల్లి | 10- |
| 34 కడ్మిశెట్టి చిన్నవీరన్నసన్సువారు - అనకాపల్లి | 10- |
| 35 బొండాడ నూకరాజుశ్రేష్ఠిగా - తుని | 10- |
| 36 గోపిశెట్టి మల్లయ్యసన్సుగార్లు - విజయవాడ | 10- |
| 37 కపలవాయి కాశీరామరావుగారు - నర్సారావుపేట | 10- |
| 38 మండవ వెంకటరెడ్డిగారు - నర్సారావుపేట | 10- |
| 39 మామిడి యల్లాసాగారు - వరంగల్ | 10- |
| 40 కొండూరు రామలింగంగారు - వరంగల్ | 10- |
| 41 కొండూరు బుచ్చిరాజలింగంగారు - వరంగల్ | 10- |
| 42 సూర్యదేవర పట్టాభిరామయ్యగారు - వరంగర్ | 10- |
| 43 సిద్దంశెట్టి లింగయ్యగారు - వరంగల్ | 10- |
| 44 పడిశాల వీరభద్రయ్యగారు - వరంగర్ | 10- |
| 45 తాటిపల్లి రామలింగంగారు - సికింద్రాబాద్ | 10- |

46 గారిశెట్టి వెంకటయ్యగారు - కరింనగర్ 10-
47 గారిశెట్టి వీరమల్లయ్యగారు - కరింనగర్ 10-
48 కొప్పరపు సుబ్బారావుగారు - ప్రొద్దుటూరు 10-
49 సి. కె. అనంత పద్మనాభంశెట్టిగారు - మడకశిరా 10-
50 సేగు ఆదిమూర్తయ్యగారి ఆదినారాయణగారు - మడకశిరా 10-
51 ఆలంపల్లి నారాయణగారు - గోరిబిదనూరు 10-
52 నామా శ్రీరంగంగారు - తుమకూరు 10-
53 నామా యస్ నారాయణశ్రేష్ఠిగారు - తుమకూరు 10-
54 చెన్నగిరి రంగప్పశ్రేష్ఠిగారు - ధావనగిరి 10-
55 దేవతి కృష్ణయ్యగారు - బెంగుళూరు 10-
56 యస్. డి. నరసింహశ్రేష్ఠిగారు - బెంగుళూరు 10-
57 యమ్. రంగస్వామి -కొళ్లెగాలం 10_
58 యస్. పి. రామకృష్ణ శ్రేష్ఠిగారు - కొళ్లెగాలం 10-
59 బి. యస్. నాగప్పశెట్టిగారు - చామరాజనగరం 10_
60 బి. యస్. రామశెట్టిగారు - చామరాజనగరం 10-
61 యమ్. కే. కృష్ణశెట్టిగారు - కోయంబత్తూరు 10-
62 ఎ. బి. సుబ్రమణ్యంశెట్టిగారు - కోయంబత్తూరు 10-
63 రాజారామ్ పాల్ వారు - కోయంబత్తూరు 10-
64 రామా అండ్ కోవారు - కోయంబత్తూరు 10-
65 పి. యస్. నాగమాణిక్యంగారు - శేలం 10-
66 టి. సత్యనారాయణశెట్టిగారు - మద్రాసు 10-
67 గొల్లపూడి వెంకటకృష్ణం శెట్టిగారు - మద్రాసు 10-
68 ముత్యాల సుబ్బరంగయ్య శెట్టిగారు - మద్రాసు 10-
69 గ్రంధి కోదండరామారావుగారు - రాజమండ్రి 10-
70 నాగవరపు శేషగిరిరావుగారు - రాజమండ్రి 10-

71 శ్రీ రాజమాన్యం మీనాక్షమ్మ జమీందారుగారు-రాజమండ్రి 10-
72 నల్లపేట లక్ష్మయ్యశెట్టిగారు - గోరీబిదనూరు 8-
73 సమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు - ర్యాలి 5-
74 సమయమంతుల రాధాకృష్ణరావుగారు - ర్యాలి 5-
75 శ్రీ తిరుపతి వెంకటేశ్వరులుగారు - నర్సారావుపేట 5-
76 బత్తుల వెంకటపేరయ్యగారు - నర్సారావుపేట 5-
77 నాగసరపు సుబ్బారావుగారు - నర్సారావుపేట 5-
78 తాళ్లూరి నాగేశ్వరరావుగారు - నర్సారావుపేట 5-
79 ఉడతా అనంతరాములుగారు - పిడుగురాళ్ల 5-
80 రాజమకుగు వెంకటేశ్వరులుగారు - పిడుగురాళ్ల 5-
81 తాడేపల్లి చెంచుసుబ్బారావుగారు - పిడుగురాళ్ల 5-
82 కొనకండ్ల వెంకటేశ్వర్లుగారు - పిడుగురాళ్ల 5-
83 అనుమోలు వెంకటేశ్వర్లుగారు - పిడుగురాళ్ల 5-
84 కొత్త మల్లయ్యగారు - పిడుగురాళ్ల 5-
85 యర్రమళ్ల రాజయ్యగారు - పిడుగురాళ్ల 5-
86 కర్నాలక్ష్మయ్యగారు - సూర్యాపేట 5-
87 పీరవెల్లి నారాయణశెట్టిగారు - సూర్యాపేట 5-
88 వనమా మట్టయ్యశెట్టిగారు - సూర్యాపేట 5-
89 కందకట్ల వైకుంఠం శ్రేష్ఠిగారు - వరంగల్ 5-
90 జి. యమ్. రాజలింగంగారు - వరంగల్ 5-
91 చందా విశ్వనాథంగారు - ,, 5-
92 తోట లింగయ్యగారి జగన్నాథంగారు - ,, 5-
93 తోట చంద్రశేఖరంగారు - ,, 5-
94 నాగబండి చిన్నకృష్ణయ్యగారు - ,, 5-
95 చందా కాంతయ్యగారు - ,, 5-

96 పొద్దుటూరి గోపాలకృష్ణయ్యగారు - సికింద్రాబాద్ 5-
97 తాడూరి రాజయ్యగారి కృష్ణయ్యగారు - ,, 5-
98 శిర్నాం సత్యనారాయణగుప్తగారు ,, 5-
99 లింగా సుందరయ్య శెట్టిగారు - ,, 5-
100 మరుమాముల రాజయ్యగారు - ,, 5-
101 లింగా వీరన్నగారి వెంటయ్యగారు - ,, 5-
102 తేలుకుంట బాలకృష్ణయ్యగారి వెంకటేశంగారు - ,, 5-
103 మాంకాల మల్లయ్యశ్రేష్ఠిగారు - ,, 5-
104 జూలూరి వీరేశంగారు - ,, 5-
105 బెలిదె జగదీశ్వరయ్యగారు - ,, 5-
106 సురకంటి నాగయ్యగారు - ,, 5-
107 జగ్న రాగయ్య శెట్టిగారు - ,, 5-
108 చందా కృష్ణయ్యగారు - ,, 5-
109 మాచర్ల రామరావుగారు - ,, 5-
110 పార్శ్రిశివయ్య బాలరాజయ్యగారు - నిజామాబాద్ 5-
111 రాపల్లి చిన్నరాజేశ్వరరావుగారు - డబ్బా 5-
112 సిద్ధంశెట్టి వీరరంగయ్యగారు - జగత్యాల 5-
113 కొత్త శంకరయ్య శెట్టిగారు - ,, 5-
114 గారిశెట్టి రాజేశంగారు - కరింనగర్ 5-
115 తొడుపునూరి నారాయణశెట్టిగారు - ,, 5-
116 నలమాచు కొండయ్యగారు - ,, 5-
117 మాలైపాటి రామసుబ్రమణ్యంగారు - ప్రొద్దుటూరు 5-
118 నాథంశెట్టి సోమయ్యగారు - ప్రొద్దుటూరు 5-
119 సి. కే. మహాదేవయ్య శెట్టిగారు - గుంతకల్లు 5-
120 సేగు ఆదన్నగారి ఆదినారాయణగారు - మడకశిరా 5-

121 కట్టా వెంకటనారాయణగారు - మడకశిరా 5-
122 మాల్యవంతం నారాయణశెట్టిగారు - గోరిబిదనూరు 5-
123 కాసల శ్రీనివాసం శెట్టిగారు - ధావనగిరి 5-
124 యస్. శ్రీనివాసం శెట్టిగారు - ధావనగిరి 5-
125 కే. జి. కే. బి. యన్. శెట్టిగారు - బెంగుళూరు 5-
126 పబ్బితి కృష్ణయ్యశెట్టిగారు - ,, 5-
127 పత్తి ఆదినారాయణశ్రేష్ఠిగారు - ,, 5-
128 డి. శ్రీరామయ్య శెట్టిగారు - ,, 5-
129 శంకరసిల్కు హౌస్‌గారు - ,, 5-
130 బి. హిమంతరాజుగారు - బెంగుళూరు (కంటూరుమెంటు) 5-
131 వ్యామజాల సుబ్బరామయ్యశర్మగారు - కోయంబత్తూరు 5-
132 పి. యస్. కే. పి. యస్. శెట్టిగారు - ,, 5-
133 సుంకు సుబ్రమణ్యంగారు - మద్రాసు 5-
134 కూనిశెట్టి రంగనాథంగారు - ,, 5-
135 కె. మల్లయ్యశెట్టిగారు - ,, 5-
136 దోగుపర్తి సుబ్బారావుగారు - చీరాల 5-
137 మాజేటి అన్నపూర్ణమ్మగారు - గుంటూరు 5-
138 పరిపాటి వెంకటరత్నగారు - గుంటూరు 5-
139 కొనగొల్ల శేషగిరిరావుగారు - తెనాలి 5-
140 యలమర్తి సుబ్బారావుగారు - రాజమండ్రీ 5-
141 మండవిల్లి రామారావుగారు - ,, 5-
142 పాదర్తి ఆదిశేషయ్య శ్రేష్ఠిగారు - ,, 5-
143 బలభద్ర వెంకట్రాజుగారు - ,, 5-
144 దేవత రామమోహనరావుగారు - రాజమండ్రి 5-

# విషయానుక్రమణిక



గ్రంథ సమాప్తి

ఓం

శ్రీ గణేశాయనమః

తే 28—4—55

కమాల్ గంజ్

# మంత్రానుష్ఠాన మహిమ

## శ్రీ సనాతన ధర్మపతాకకు జయమగుగాక

అనాథరక్షకుడును - ఆపద్బాంధవుడైన పరమేశ్వరుని ధ్యానించుటలో - స్తుతించుటలో పదిసంవత్సరములనుండి నాలోనేర్పడిన కొన్ని అభిప్రాయములు :— ఈఆలోచనలుబీజములో జీవుడు శయనించియున్నటులింతవఱకణగిమణగి యుండెను. పరమేశ్వర కృపావర్షము నాయంతఃకరణమునఁ బడినతోడనే యాబీజరూపమీవిధమైన భావపరంపరుల లతలగాఁ బెంపొందినవి. లోగడ కొన్ని సంవత్సరములు దేశసంచారము, కొన్నాళ్ళధ్యయనములోను, కొంతకాలము యజ్ఞయాగాదులయందును, తరువాత గ్రంథరచనమునందును గడచినది. మొత్తమీాశ్రమతమానులరణ్యావాసములో పదునెన్మిదేండ్లు గతించినవి. ఇన్నాళ్ళకాకరుణాసముద్రుని కటాక్షులవలే శమీాదీనునిపైఁ బ్రసరించినది. ఇంతవఱకు నెడతెగని కార్యక్రమములలో తగునవకాశము లభింపదయ్యెను. ఈనాడు గల్గిన యవకాశము లేమనగా 1 లోకప్రసక్తిలేకుండ నొకయేడజ్ఞాతముగానుండుఁ గల్గుట 2 గంగానదీప్రాంత నివాసము 3 ఏకాంతవాసము 4 ఆమలకవృక్షము (ఉసిరిచెట్టు) క్రింద జపించుట. ఇట్టి వీలును కల్గించిన ఆవిశాల చిత్తునికి నాకృతజ్ఞతాపూర్వకవందనములు సమర్పించుచున్నాను. కర్మ జీవులకు భగవన్నామ స్మరణము - పూజనము - సేవనములనునవకాశ

ములు దొరకుట కష్టము. అట్టిదొక సంవత్సరమువరుసగా నాప
రాత్పరుని స్తుతి - నైవేద్యహారసమర్పణాది కైంకర్యములు నాకుం
బ్రసాదించినభగవంతునియద్భుతశక్తి నేమనికొనియాడఁగలను? నాకు
సహచరులై యున్నవారిమనస్సులునవి నిర్మలములగుటవలన వాతా
వరణజనితక్లేశములేమియులేక ప్రశాంతి చేకూరినది. ఈనాటి సంఘటన
నాకొకమహోపదేశమును గావించుచున్నది. సర్వేశ్వరుండే మానవుల
హృదయాంతరాళములలోని యాస్తికములనవగతముచేసికొని - వేయి
విధాల తోడ్పడునను నిత్యసత్యము నాఅనుభవమువలన గ్రహించితిని.
ఇతరులవలననేవిధమైనసౌఖ్యముండదు. పూర్వచరిత్రలో చంద్ర
సమానకీర్తులైన ధ్రువప్రహ్లాదముఖ్యులను దృష్టిలో నుంచికొని -
అంతచేయలేకపోయినను సాధ్యమైనంత వఱకునిష్ఠాగరిష్ఠుఁడనై యుండి
యీదీక్ష పూర్తిచేయనెంచితిని. ఈ యజ్ఞాతకాలమనిన సంవత్సర
కాలములో నేనెదుర్కొనవలసిన సంఘటనలున్నవి. ఒకటి
రాక్షసులబాధ, రెండవది స్వహస్తపాకము. మూడవది సరియైన
యేర్పాటులు లేకపోవుట. ఇన్ని యిబ్బందులున్నను భగవంతుని
పై భారముంచియుంటిని. జ్యేష్ఠ - ఆషాఢమాసములలోని మేఘ
ముల రాకకై చాతకపక్షులెదురు చూచుచుండును. ఆజలధరములు
కురియకుండగనే పారిపోవును. అప్పుడు చాతకములు నీరసదృక్కు
లతో నిస్స్పృహతో వానివంకకే చూచుచుండును. నాపరిస్థితి వానిపరిస్థితి
యొక్కటియేయని యీయుదాహరణమున బోధపడును. పాపమా
చాతకపక్షులతపస్సు శ్రావణ భాద్రపదములనాటికి ఫలించును. అట్లే
మఱి యారుమాసములలో నానిశ్చితార్థము నెఱవేరును గదాయను
నాశతో నిరీక్షించుచున్నాను. బొందెలో ప్రాణమున్నంతవఱకీవిధ
ముగానే యీశ్వరసేవ చేయవలెననియే దృఢసంకల్పమున్నది. అదియే
సర్వేశ్వరుని నేను వాంఛించుచున్నాను.

తే 17-5-1955

# సనాతన ధర్మమునకు జయమగుగాక !

ప్రియమిత్రులు బ్రహ్మశ్రీ వేదమూర్తులగు బంకాల గణపతి శ్రేష్ఠిగారి దివ్యసముఖమునకు శ్రీ ఆత్మానంద బ్రహ్మచారి ఆశీర్వాదములుచేసి వ్రాయునది. ఇచట సర్వ క్షేమము.

ఈ పవిత్రక్షేత్రమున మానిత్యకృత్యములీవిధముగా నున్నవి. ప్రతిదినము బ్రాహ్మముహూర్తమున లేచి సర్వాంతర్యామియైన పరమేశ్వరుని ధ్యానించుటయు పిదప గణాధిపతిని - గాయత్రీ దేవతను - నారాయణ రామకృష్ణాది నామములను, ఉపనిషన్మంత్రముల నుచ్చరించుచు గడచిన జన్మలలోఁ దెలియక చేసినపాపములు పోవుటకై ప్రార్థింతుము. తక్కిన కాలకృత్యములు దీర్చుకొను సమయమునందొక్క నిమేషమైనను పరాయత్తము గాకుండఁ జిత్తమునీశ్వరా యత్తముగాఁ జేయఁ బ్రయత్నింతుము. ఈప్రదేశములలో చైత్ర వైశాఖ మాసములు మన దేశములోనెట్లుండునో యట్లే తెల్లవారుఝామునఁ గొంచెము చలిగానుండును. స్నానమున కాలస్యమైనచో పూజాది నిత్యానుష్ఠానములు పూర్తియగుసరికి 11, 12 గంట లతిక్రమించుచున్నది. 12 గంటలలోపుననే పూజ ముగియవలెను. అందుచే నింతటి బాధ్యతాయుతదినకృత్యము నిర్విఘ్నముగా జరుపవలెనన్న నెంత కష్టముగానున్నను తెల్లవారుఝామున లేచినఁగాని యివన్నియును బూర్తి కానేరవు. నిజమైన భగవత్సేవ చందన - అలంకరణములు చేయునప్పుడును - పూజ - సేవలే మొనర్చినప్పుడైనను బుద్ధిని చలింపనీయనట్లు చూచుచుంటిని. ఇట్లు కొన్నాళ్ళు సేవావిధానము నిశ్చల ప్రవా

హాముగా జరిగినపుడొకఁడైనను ప్రశాంతచిత్త మలవడకతీఱదు. పూర్వు లీవిధముగానే స్థిరయోగనిష్ఠాగరిష్ఠులైనారని తలంచుచుందును. ఘృతదీపారాధన చేసినతరువాత పూజాక్రమము పూర్తియగును. పిమ్మట నిరువదినాల్గక్షరముల రుద్రగాయత్రీ మంత్రమును దినమునకు 7000 చొప్పునఁ జేయవలసియున్నది. ఈ జపము పూర్తియైనతోడనే మాధ్యాహ్నిక సంధ్యావందనము పిమ్మట భోజనమునకు సిద్ధపడెదను. వంటచేయు సమయములోఁగూడా ననుష్ఠానదేవత నామమును మనసా యుచ్చరించుచుందును. తరువాత ఉసరిక - దేవదారు మొదలైన చెట్లకు వంటశాల పూజాగృహములకు వలయు నీటిని దెచ్చి పోయుచుందును. ఆసమయము నందైనను మహేశ్వరధ్యానవిముక్తుఁడను మాత్రము కానేరను. భాగవతములో "పానీయంబులు త్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీలా నిద్రాదుల" యను పద్యార్థము మీరెఱిగియే యుందురు కదా!! వంటయైన పిమ్మటఁ బంచదేవతలకుఁ బంచయజ్ఞములు చేసిన పిమ్మటనే భోజనమునకుఁ గూర్చుందును. భుక్తాయాసము తీఱునంతవఱకు విశ్రమింతును. ఆవేళనైనను భగవన్నామానుసంధానము విడచుటలేదు. తరువాత భోజనపాత్రాదికమును శుద్ధిగావించెదను. సాయంసమయ సంధ్యావందనమొనర్చుకొందును. ఏకభుక్తమగుటచేత రాత్రి వంటకప్రయత్నముల బాధలేదు. తరువాత శ్రీ గాయత్రీదేవతాపవిత్ర మంత్రమును 1250 సార్లు జపించి - అనుష్ఠాన దేవతను స్మరించుకొనుచు పరుండెదను.

ఈవిధముగా ప్రతిదినము జరుగవలెను. జరుగుచున్నది. ఈనిరంతరదీక్షా నిమగ్నమగుటచేత శరీరము కృశించుచున్నది. శరీరాభిమానము పెఱిగినకొలఁది భగవంతుఁడు దూరమగుచునేయుండును. భగవత్సేవా సమర్పితమైన తనువే తనువని ప్రహ్లాదోక్తి. విశేషభోజన ద్రవ్యములు కావలెనన్నను — ఆసౌకర్యములను గల్పించువారావిధ

మైనయెక్కువసామాగ్రి నీయలేమన్నారు. అందుచేతనే నేను ప్రాణరక్షణ కవసరమైనంత పదార్థమునే యివ్వమంటిని. నాశరీరయష్టి కృశించినను అంతఃకరణమూ యీశ్వర పాదారవిందాసక్తమగు చున్నది. అదియే నా అదృష్టవిశేషము. సంవత్సరసుదీర్ఘ పరిమితిగల యీానిష్ఠాక్రమము నిరపాయముగాజరుపుట మానవాతీతమైనది. కావున నాబరువు భారమూ దేవదేవునియందే సమర్పించియుంటిని. ఈకాలముననే శీతవాయుప్రసార మధికముగానున్నది. ఇక శీతకాల మునందెట్లుండునో !! పరమేశ్వరునకే యెఱుక. మొత్తమీయనుష్ఠా నమునందు 2650000 మంత్రములజపోచ్చారణము చేయవలసియున్నది. ఈమంత్రము లుసిరికచెట్టుక్రింద నుచ్చరించినచో నొక్కమంత్రభాగ ఫలితమునకు నూఱుభాగముల ఫలితము ప్రాప్తించును. అందుచే మొత్తము 2650000 మంత్రజపఫలిత ముండును. ఈఫలితము నాస్వార్థమునకేమియుఁగాదు. నాతలిదండ్రులకు, నాయాశ్రిత శిష్యు లకు — ఆత్మమిత్రులకు సంప్రాప్తించును గాక !!

ఈవిషయములను సవిస్తరముగా నాత్మమిత్రులైన కిల్లంశెట్టి లక్ష్మణమూర్తి, మల్లేశము, బెల్లాన వెంకటప్పయ్యగారు, జామి గురు మూర్తిగార్కి తెలుపవలెను.

ఈసందర్భములోఁ గొన్నిముఖ్యకారణములవలన మౌనదీక్షకూడ నీమధ్య స్వీకరించుట జరిగినది. ప్రజలద్వారా యెన్నోవిఘ్నములు రాఁగలవు. వర్షబిందువులుపడినపిమ్మటఁ జల్లారెడు భూమివలె, మౌనము వహించుటచే హృదయము చల్లఁబడును. మౌనమిట్టి ఆధ్యాత్మిక కార్యకలాపమునకు ముఖ్యావసరమని యనుభవజ్ఞులాదేశించినారు. నేనీదీక్షనే యవలంబింపకుండినచో నీమహత్కార్యముసగములో విధ్వంసమై యుండెడిదే.

శ్రీ గణేశాయనమః

ది 28-6-55

# శ్రీసనాతన ధర్మమునకు జయముకల్గునుగాక

ఈయుత్తరము మూడవమాసమునకు జెందిన విషయములను దెల్పును. మొదటి రెండుమాసములకంటె నీమాసములోని అనుభవ విషయము లతిచిత్రముగా నుండును. ప్రస్తుత యెండలబాధ చాల తీవ్రముగానున్నది. నోరు పిడుచగట్టుచున్నది. ఒకానొకప్పుడు కన్నులు చీకటి గ్రమ్మును. ఎన్నికష్టము లెదుర్కొన్నను పురుషకార్యమును విడువక చేయుచువచ్చితిని. అనంతర మెక్కువవేడి తత్త్వముగామారుటచే నతిదారుణమైన మూలవ్యాధి సంక్రమించినది. ఎడతెగక నెత్తురు స్రవించుట మొదలు పెట్టినది. ఈసత్కార్యమునకు సహాయముచేసి నటువంటి ముగ్గురుభక్తులకుఁ దెలియఁజేసితిని. వారు విన్నారు. అందొక భక్తులు చీటివ్రాసి పంపుచు నాసుపత్రికి వెళ్ళుటయే కర్తవ్యమన్నారు. ఆవిషయము విన్నతరువాత చాలదుఃఖించితిని. అప్పుడు పరమేశ్వరుని మొఱపెట్టుకొంటిని. "సర్వేశ్వరా॥ యిన్నాళ్ళనుండి సేవ చేయవలయునని యెంతో యాశించితిని. ఇంతలోనిన్నియవకాశములొసంగి యింతలోకార్యవిఘాత మొనర్తువా? ద్రౌపదీ మానసంరక్షకా॥ నాకెవ్వరాప్తులున్నారు? నీవేగదా! సర్వశరణ్యుడవు॥ అని ప్రార్థించి లింగప్రతిష్ఠచేసిన మందిర ప్రాంగణములోపలికి వచ్చి ముఖ్యమైన కొన్ని సామానులుకట్టి ప్రయాణమునకు సిద్ధపడితిని. ఆభక్తులతోఁ జెప్పి వెళ్ళిపోదలఁచితిని. కాని యింతలో విచిత్రసంఘటన జరిగినది. భగవంతుఁడు వారిమనస్సులలోఁ బ్రవేశించి యొకసంకల్పమును బుట్టించినాఁడు. వారు మంచిమందు తీసికొని నాదగ్గఱకు వచ్చినారు. ఈయౌషధమువలననే కష్టనివారణ మగునని చెప్పినారు. రెండు

మూడురోజులు వాడిన తర్వాత క్రమముగా నాబాధ తగ్గిపోయినది. తర్వాత కొన్నాళ్ళకు రాక్షసులు దండయాత్ర చేయసాగినారు. వారిలో ముగ్గురుపెద్దవారుచేత దండములు ధరించి నామీదకు ప్రహారము చేయవచ్చినారు. వారిని దూరముగాఁ బొమ్మని కరసంజ్ఞ గావించితిని. పరమేశ్వరస్వరూపులుగా భావించి వారికి నమస్కరించితిని. అప్పుడు వారు శాంతించినారు. ఈసంగతినాకప్పుడప్పుడుసహాయకులైన మువ్వురు భక్తసోదరులకుఁ జెప్పితిని. ఆమువ్వురిలో నొకండు వేదాంతవిచారణ పరుఁడైనా సక్రియాశూన్యుఁడు వాడా రాక్షసులను పిలిపించిరి. నాపాదములపైఁబడి క్షమాపణ కోరుకొన్నారు. అప్పుడు వారిని భగవంతుని వేడుకొమ్మని మౌనముతోఁ గరసంజ్ఞ గావించితిని.

మౌనదీక్ష వహించుటచేతను నేనెవ్వరివద్దకు వెళ్ళకపోవుటచే నిసత్కార్యము నెఱవేరినది. ఈవిధముగా వేసవికాలదీక్ష నిర్విఘ్నమైనది. భూమిచల్లఁబడినది. ఈయూముద్రలో బీజములు మొలకలెత్తునట్లే సత్కార్యబీజాంకురములు తలలెత్తు సూచనలగపడుచున్నవి.

లింగప్రతిష్ఠగావించు నప్పుడు నాచేత నాఱణాలు మాత్రమే యుండెను. నేననుష్ఠానములోనికిఁ బ్రవేశించినపుడొక్క సురకానియైనను నాచేత లేకుండెను. అందుచేతనందఱకుత్తరములు వ్రాయుట కష్టముగా నున్నది. ఈమాసములో కష్టములధాటికి సహింపలేకచాల సార్లేడ్చితిని.

ఓం

28–7–55

## సనాతన ధర్మమునకు జయమగుగాక !!

ఈ ఉత్తరము నాల్గవమాసములోని విశేషముల నెఱుగపఱు

ఇది వర్షకాల మగుటవలన భోజనముచేయుటకుఁ దగిన

యేర్పాట్లు లేనందున) కష్టముగా నున్నది. ఈకష్టములు చూచువారి కెంతో హృదయవిదారకముగానుండును. ఈ కష్టములలో నేర్పడిన సంఘటనలలో మనస్సనకువిజ్ఞానమను న్యాయాధికారికి జిత్రమైన సంవాదమగు చుండును. మనస్సిట్లనుగును. సకలదేశములను సంచరించితిని. సకలవిషయములు నాకవగతమైనవి. కావుననీ కష్టములననుభవించుటవ్యర్థముకదా! ఇపుడుచేయునది భోజనముకాదు. ఏదో క్షుద్బాధను దీర్చునది మాత్రమే. అందునను తీసికొనునదొక్క పూటయందేగదా!! గాలివాన యలజడులవలన భోజనముచేయుటకూడకష్టమేగదా!! అపుడు బుద్ధియను న్యాయవాది, న్యాయమూర్తితో నీవిధముగావిన్నవించుకొనెను. ఇతరుల నాశ్రయించుకొనియుండుటలోఁగూడ పరోపయోగమునకేగదా !! అట్టిచో వారెటులున్న మనకెందులకు ? ఇప్పటి పరిస్థితులలోఁ బ్రజలు బొత్తిగాస్వార్థపరులైయున్నారు. మనమేమి వారి ప్రయోజనముకై కృషిచేసినను ప్రయోజనము శూన్యము. ఈ వ్రతానుష్ఠానమువలన ప్రయోజనమేమున్నది ? అప్పుడు చిత్తమీవిధముగా న్యాయమూర్తితోఁ జెప్పెను. ఇట్టి సత్కార్యములెన్నో ప్రజాక్షేమముగోరి జేసితినిగాని దానివలనఁ గలిగినదేమియులేదనెను. అంతటనహంకారము హుంకరించి యిట్లుచెప్పసాగినది. నాకంటెఁ దెలిసిన వారెవరున్నారు ? ఉన్నను లక్షకు, కోటికొయొక్కరుండ వచ్చును. అందుచే మనమెచ్చట సంచారముచేసినను దేనికిని లోటురాదు. అందుచేనీవ్రతమునుచాలించుట మంచిది. ఈ విజ్ఞాపనలువిన్న పిమ్మట న్యాయాధికారి యీవిధముగాఁ జెప్పఁదొడఁగెను. (ఆచారః పరమోధర్మః) ఆచరణ పరమ ధర్మమైనది. పది సంవత్సరములనుండి యిట్టి వ్రతానుష్ఠానావకాశము దొఱకునా ? యని యాకాంక్షించుచు నిట్లీనాడు మధ్యలోఁ బరిత్యజించుట యోగ్యమేనా ? ఇప్పుడు భయపడవలసినదేమున్నది ? ఇట్టి సదవకాశము జీవితమునమఱల

రాకపోవచ్చును. ఎన్నికష్టములు వచ్చినను., కడకుఁ బ్రాణాపాయము వచ్చినను వానిని లెక్కింపక నిశ్చితార్థమును సాధించువఱకు నిశ్చల మతులు ప్రయత్నములు విడనాడరుగదా !! బలి, శిబి, హరిశ్చంద్ర ప్రముఖులొక్క ధర్మనిష్ఠకై యెట్టి మహాత్యాగములు గావించి నిర్మల కీర్తి మూర్తులైనారు? ఆత్మసృష్టిలోఁ బరిశీలించిచూచినచో నను నీవారే. నీయాత్మకు భిన్నులెవ్వరునులేరు. కావునసీజీవితాంతము వఱకు నీకున్న విజ్ఞానము నాచరణమునకుజతపరచి నీయనుష్ఠానము లోకసంగ్రహమున కుపయుక్తమగునట్లు చేయుము. పూనినకార్యము నెఱ వేర్పకభీతివహించుట సనాతనధర్మమునకు వ్యతిరేకముగదా!! అను ష్ఠానము పూర్తిచేయుటయే మానవధర్మము.

ఓం

ది. 28-8-55

## శ్రీసనాతన ధర్మమునకు జయమగునుగాక !!

ఈ క్రిందఁ బొందుపఱచు విషయములైదవమాసములో జరిగినవి. వర్షకాలమగుటచేఁదగిన భోజనవసతులు లేకున్నవి. చూచు వారిదీక్షానిర్వాహణమెట్లు సమాప్తియగునని పరికించుచుచుండిరి. ఈసందర్భములో ముగ్గురుభక్తులు సహాయముచేయుచు వచ్చినారు. అందొక భక్తుఁడొకసారి పిండి పంపించెను. ఆపిండి రొట్టెలు చేసికొని తినుటవలన నాకడుపులో నొప్పి కలిగెను. ఆబాధ కోర్వలేక యేడువఁ దొడంగితిని. తదుపరియౌషధము సేవించివలసివచ్చినది. పిమ్మట స్వస్థత చేకూరినది. తరువాతకూడ నాపిండినే రొట్టెలుగాఁ జేసికొని తినవలసివచ్చినది. దానివలన కాళ్ళు పీకులు, కొలఁదిగా కడుపునొప్పి యగుట, ప్రారంభించినది. ఈదోష మాపిండివలనన కలుగుచున్నదని

భావించి, మాపిండినొక భక్తుని ద్వారా శ్మశానమునకంపి, దానిని దీసి కొని మంచి గోధుమపిండి నిమ్మని కోరితిని. ఆదుకాణదారుండట్లే మంచిపిండి నొసంగెను. నేనిసంగతి మొదట పిండి యిచ్చిన భక్తునితోఁ జెప్పితిని. నేనట్లు పిండినిమార్పించుట తనకి గిట్టలేదు. దానితో మండిపడి కొన్ని దూషణవాక్యాలు ప్రయోగించి వెడలిపోయెను. ఒక భక్తునియింట దొంగలొకరాత్రిబడి సర్వము దొంగలించినారు. ఈ విశేషముగా భక్తులలో మనోవైకల్యము బయలుదేరినది. ఈకారణ మున యీయనుష్ఠానము నిలిపివేయుడన్నారు. ఆమాటలు విన్నతర్వాత నాహృదయములో శూలములు గ్రుచ్చినట్లయినది. సూర్యునిమీదికి మేఘమాలికలువచ్చి కప్పినట్లు నాప్రయత్నాలను గొన్ని చెడుకర్మ లడ్డగించుచున్నవి. ఇంతవరకు నేను చెప్పిన బహిరంగభక్తులేమియుఁ గ్రియా సూచకములుగాఁ జేయుట మానిరి. భగవంతుని అపారకృపవలనఁ గొందఱాంతరంగిక భక్తులేర్పడినారు. వారివలననీ వ్రతానుష్ఠాన మిప్పుడు బాగుగాజరుగుచున్నది. ఈకష్టములు చూడలేక నేలకురెండు వేప చెట్లొరిగి పడినవి. వానికెదురుగాఁ బరమేశ్వరుని మందిరమున్నది. ఒక చెట్టు వంటకట్టియలకు రెండవచెట్టు వంటశాలకు స్తంభముగా నమర్చఁబడుటచే నారెండును నోరులేనివైనను నాదుస్థితిని గ్రహించి యీవిధముగా సాయపడినవిగాని, నోరున్నమానవులు మాత్రము సహకార మొసంగలేకపోయిరి.

ఇప్పుడు వర్షములు పడినందువలన భూమివలె నామనస్సుకూడ చల్లారినది. ప్రస్తుత ముసిరికిచెట్టుక్రింద జపాదికమంతయు జరుగుచున్నది. నాల్గుమాసాలక్రిందటనున్న విషమపరిస్థితులిప్పుడు లేవు. ఇప్పుడొక కామధేనువు ప్రాప్తించినది. పిండి, బియ్యము, పప్పు, ధనము, కావలసినవన్నియు నాకామధేనువే యొసఁగుచు వచ్చినది.

త కామధేనువన్వరనంగా వయాచితముగా వచ్చిన అంతరంగిక భ్రాంతి
వారే యీసత్కార్యము జరుపుచున్నారు.

ఒకప్పుడు మనందఱము మహేంద్రగిరిలోనుండిన పరిస్థితులే
యిచ్చటనున్నవి. ఒకసారి భయముగా నుండును. ఇదే యనుష్ఠానము
మన దేశములో జరిపిన నింకే బాధలేకుండునుగదా యన్పించును. ఈవిధ
ముగాఁ బలురకములైన భావతరంగాలు హృదయమునుండి లేచును.
క్రుంగును. ఇట్టి పుణ్యకార్యములు జరుపఁ గోరువారు బ్రాహ్మీము
హూర్తమున లేచి జలములోనిన ముక్కోటి యనుష్ఠానము పూర్తి చేయుట
తేలికయైన పనికాదు.

శ్రీ గణేశాయనమః.

ది 28—9—55
కమూల్ గంజ్

# శ్రీ సనాతన ధర్మమునకు జయమగుగాక !

పశుపక్షి క్రిమిజాతులకు సామాన్యజ్ఞానముండును. ఒకరిని
వంచించుట, యుక్తిగా మాట్లాడుట, యదార్థము చెప్పకపోవుట,
మొదలైన దుర్గుణములన్నియు లోకములోనుంచి గొప్పతనము
వహించును, గాని యీవిరుద్ధలక్షణములు దీర్ఘముగా యోజించిన
సత్యమార్గమునకుఁ బ్రతిబంధకములే. ఈదుర్గుణములు ప్రస్తుతవాతా
వరణములో కొండజాతులలో, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యాదు
లందు దఱచుగాఁ గానఁబడుచునే యుండును. ఈలౌకికవిజ్ఞానము
పరులను మట్టికొట్టి మేడలు మిద్దెలు కట్టింపఁజేయును. అందఱి
కంటెఁ దనను గొప్పవానిగాఁ బరిగణింపఁజేయును. ఈమేడ మిద్దెలు,
ఆస్తిపాస్తులు, పదవులు తాత్కాలికమైనవే. మాతృగర్భమునుండి

వచ్చిన శరీరమే నష్టిపాలగుచున్నప్పుడు మిగిలినవాని మాట చెప్ప వలెనా ? సత్యుఁడును, చిదానందుఁడును, దయామయుఁడైన భగ వంతుని దెలియఁగల జ్ఞానమే జ్ఞానముగాని యితరములన్నియు నజ్ఞాన మేగదా !! అందుచేతనే ప్రహ్లాదుఁడు "చక్రహస్తుని ప్రకటించు చదువు చదువన్నాడు. భగవంతుని గ్రహింపఁదగిన విజ్ఞానోపార్జ నమున కామార్గమునందు గడిదేరినయుత్తముల నాశ్రయింపవలెను. ఇట్టి బ్రహ్మజ్ఞానము సర్వభూతములందు బ్రహ్మత్వమునుదర్శించుచు సమభావముగల బ్రహ్మనిష్ఠులకడను, సదాచారసంపత్తిగల పండితుల చెంతను, ఉపాసనానిష్ఠుల ప్రోలను, పతివ్రతల దగ్గఱను, యోగీ శ్వరుల వద్దను, భవవర్జిత బుద్ధిగల గృహస్థులయందుండును. బోధ నలలో బ్రహ్మత్వమును, తమ యరచేతులలో వైకుంఠమును జూపుట కేవలమది లౌకికవిద్యయే యగును గాని, అనుభవవిజ్ఞానము కానేరదు. పైనుదహరించినవారందఱును తమ నిత్యజీవితములందా విశుద్ధబ్రహ్మ విజ్ఞాన విలసితులై యుందురు.

ఎఱుకగలవారి చెంతనే జననమరణవిముక్తి హేతువులను తెలుపఁ బడినవారై, లౌకికవిజ్ఞానమును దూరముచేసి, దుఃఖములనోర్చి, సత్య మలవఱచుకొని, పరమశాంతులై, ఆధ్యాత్మికజ్ఞానము సంపాదించు కొని సంసారబంధములనుండి విడుదల కావలెను.

ఆత్మసోదరా !! ఈజన్మము క్షణభంగురమైనది. ఈక్షణమో మఱుక్షణమో యెవ్వరితోఁ జెప్పకుండగనే వెళ్ళిపోవలసియున్నది. ఈజన్మరహస్యమునర్థముచేసికొని—శరీర, మనోబలములున్నపుడే బ్రహ్మ జ్ఞానోపార్జనకుద్యుక్తుఁడవగుము.

శ్రీ గణేశాయనమః

28—9—55

కపూర్తలా

# సనాతన ధర్మమునకు జయమగుగాక!!

సనాతనధర్మమే సకలలోకములకు, సకలజాతులకు, సకల దేశములకు, సకలధర్మములకు, సకలరోగములకు ముఖ్య దివ్యౌషధము. ఈ ఔషధము నేమానవులు సేవింతురో వారికి పునర్జన్మ ముండదు. కావుననో మహాశయులారా!! సనాతనధర్మము యొక్క పరిభాష వినుడు. ఈసనాతనధర్మమే సృష్టినుండి ప్రారంభమైనది. ఇది సృష్టియంతము వఱకుండును. ఇది భూతభవిష్యద్వర్తమాన కాలములందుసమానముగానుండును. దీనికిఁ జిన్నయితిహాసమును జెప్పెదను వినుడు. పసిపాపలేక బాలుఁడు గొఱ్ఱెమేక, గేదె, ఆవు, డబ్బా పాలనుపయోగించునప్పుడు పసిపాపలేక బాలుడుకూడ రోగగ్రస్తుఁడగుచున్నాఁడు. ఆబాలుఁడే తల్లిపాలు సేవించినచో దినదినము శుక్లపక్ష చంద్రుని వలె వర్ధిల్లును. కావున నోమహాశయులారా!! మీరు భూతప్రేతములకు, క్షుద్రమంత్రములకు, దొంగతనమునకు, కపటమునకు, మద్యపాన వ్యభిచారములకు, అసత్యమునకు, స్వార్థమునకు, మొదలైన చిన్నవిషయములందు మనస్సును బోనీయక, కేవలమాదినుండి వచ్చు, సనాతన ధర్మమునాశ్రయించి, దేవదేవుని, ప్రార్థించి, యనంతరము స్నాన సంధ్యావందనములు నెఱవేర్చుకొని, గృహమును పవిత్రము చేసికొనవలెను. గృహచ్ఛిద్రములున్నచోట విషజంతువులుండును. కావుననే గృహప్రవేశమును శుద్ధిచేసికొనవలెను. బాహ్యముగా గృహమును, అధ్యాత్మిక దృక్పథములో శరీరమునందున్న మనస్సును పవిత్రపఱచుకోవలెను. తెలిసియుండియు నింద్రియసమూహము

కొంతకాలము ద్వేగమునకు సహింపలేక తప్పటడుగులు వేసినప్పుడు, ... లందును, గుప్తప్రదేశములందును, తెలియకయో, తెలిసియో ... కాయిక, మానసిక, వాగ్దోషములు నిత్యానుష్ఠానములో నున్న ... దోషభూతములంత శ్నేత్రమునకుఁ గనపడును. తిరిగి యట్టి యపకీర్తుల సేఁక జేయ ననియెడు దృఢనిశ్చయము కలవఱచుకోవలసి యుండును. ఈ విధముగా తత్త్వయోగ, సాధనములు పశ్చాత్తాపానంతము జరుపవలెను. ఇదియే సనాతన ధర్మము.

శ్రీ గణేశాయనమః

తే 8—10—955

కమాక్షి

## సనాతన ధర్మమునకు జయమగుగాక !!

ఈ యంతఃకరణ ప్రవృత్తిజ్ఞానమునకే చక్రవర్తికలడో ... చక్రవర్తికిఁ దెలియకుండఁగనే తనయిచ్ఛానుసారముగా నప్పుడప్పుడు వెళ్ళిపోవుచుండును. కావున నేయతఃకరణమును సర్వకాల సర్వావస్థలం దాధ్యాత్మిక చింతనమునందుండునట్లు చూడవలెను. అనేక స్థలములు నిర్జన ప్రదేశములైన యరణ్యములందును, నదీతీరములందును, పవిత్రమైన యేకాంతస్థలములందును, నీకలియుగమున సుమారు పన్నెండు వత్సరాలేక దీక్షగా బ్రహ్మచర్యములోనుండి, తపస్సొనరించుచుండినయెడల నంతఃకరణ ప్రవృత్తి కధీశ్వరుఁడైన చక్రవర్తికి వశమగునని నాదృఢవిశ్వాసము. మనస్సుగంటి గింజకంటె మిక్కిలి సూక్ష్మమైనది. కావుననే యందు భావము నిలువఁబడుట కష్టము.

పూర్వము మహర్షులు, మహాత్ములు నదీతీరములందు, పర్ణకుటీరములందుండుచు, కందమూల ఫలాదులను భుజించుచు, తపస్సు

వచ్చునాసికాగ్ర దృష్టిఁజెందుచు, వల్కలములు ధరించి, నిరా
హారులై హాయిగాఁ దపస్సు చేసికొనుచు బ్రహ్మచర్యాసక్తులై
ండ మండుచుండెడివారు. నానావిధములగా జీవన్ముక్తిని
వారు, ఈ విషయమునే మనము పూర్వ గ్రంథములవలనఁ
నుచున్నాము. అప్పటి కాలములో కొందరు మహాత్ము
త్తిచే జీవించెడివారు. ఉంఛవృత్తియనఁగా పైరులు చేసి
నంతర రాలిపడిన గింజలనేరుకొనితినుట. దీనినే మనన్యావ
షలో ఏకీయందురు. మలినావరణవిక్షేపముల నెవఁడు
సకొనునో వాఁడే నిజమైన సన్యాసియగును. మలినమనఁగా
వాసనలు, ఆవరణ మనగా, మాయతెఱ, విక్షేపమనఁగా
చెప్పఁబడును. నాయనుభవములో నీమూఁడు దోషములు
తొలఁగిపోలేదు. ద్వాదశవత్సరపరిమితిలో బ్రహ్మచర్యదీక్షతో
తాత్త్విక సాధనమును గురుముఖతః శ్రమించి యభ్యసించునో
తార్థజన్ముఁడై, జరామరణ, జన్మదుఃఖవిముక్తుడగును. ఇట్టి
ంచిన మహాపురుషుల దివ్యచరిత్రలను పఠించి, విని, మనము
గాని మనమీసంసారచక్రమునుండి యావలికిఁబడుట కష్టము.

శ్రీ గణేశాయనమః

తే 8–10–1955

కమాల్గంజ్

## సనాతన-ధర్మమునకు జయముగల్గుగాక

నాప్రియ మిత్రులైన టంకాల గణపతి శ్రేష్ఠిగారి దివ్యాసము
శ్రీ ఆత్మానందబ్రహ్మచారి వ్రాసికొనునది. ఈ యుత్తర
సములో జరిగిన విషయములను విశదపఱచును. ఇదివరలో

నాలుగుమాసములు మిగుల విషమముగానే గడచినవి. అనంతరము కానుక్షేమప్రాప్తించినది. ఈవాతావరణములో నిక కల్పవృక్షశాఖాచ్ఛాయలుపడు కొన్ని సూచనలగుపించుచున్నవి. నేనివ్రతము ప్రారంభించుసమయములో నెట్టిసంకల్పముగలదో తదనుగుణముగా నిత్యవ్రతనిత్యానుష్ఠానము పుష్కలముగానే కొఱంతలేకుండ సాగిపోవుచున్నది. ఈయాశ్రమ ప్రాంతములందెవ్వరును గంటికి కనబడకుండ నుండవలెనని నాకోరికయుండెను. ఒకప్పుడు నావద్ద భగవద్గీత శుద్ధముగా నానద్ద నభ్యసించిన మైసూరు దేశస్థులైన శ్రీనారాయణ శెట్టిగారికీయాశ్రమ విశేషములను - ఈవ్రతానుష్ఠానమును గూర్చి యొక జాబువ్రాసితిని. వారుదారబుద్ధిగలవారగుటచే వెంటనే నేను కోరకుండగనే రూ 10 లు నేతిఒత్తులు, చందనకర్పూరములు, వాసన పుల్లలు మొదలైనసామానులు పంపించియుండెను. "యద్భావంతద్భవతి" యను సూత్రప్రకారముగా నా సంకల్పమునుబట్టి దయామయుఁడైన భగవంతుని కృపవలన సక్రమముగా జరుగుచున్నది.

సోదరా ! ఒకవిషయము వ్రాయుట వింతగానుండునేమో మహాత్ములు, మహర్షులు వైరాగ్యసంపన్నులు తుచ్ఛమని - ఉచ్ఛిష్టమని విడచిపెట్టిన ద్రవ్యమునకై మానవులు దూరదృష్టిలేక పరస్పరము కలహించుచున్నారు. వేయేల ? తల్లిదండ్రులకే యీతుచ్ఛధనము విరోధమును దెచ్చిపెట్టుచున్నది. ఈధనసంపాదనకై పెక్కురు పెక్కుతంత్రములు పన్ని యీవిత్తమునార్జించి నిందలపాలగుచున్నారు. ఈధన మెంత పాపిష్టిదనఁగాఁ జీవులకు బద్ధస్నేహమునుగూడ మంటఁగలిపి కడకుఁ బ్రాణములు తీయును. ఈధనాశాపరులు మోక్షమార్గమునకుఁ బోవుటకుబదులుగా నరకమునకు దప్పనిసరిగాఁ బోవుచున్నారు. ధనము మరియొకజన్మకు గారణమగుచున్నది. అయాచితముగావచ్చు ధనము

తోడ్పడుచుండుట మేలుగాని పేరాసగూడదు. ఆత్మయొక్కటియే ఇతరములన్నియు జీవరాసులే. ఇచ్చట నివియన్నియు నశించును. కావున తుచ్ఛమైన యీయనిత్యపదార్థములయందు మమకారమును తగ్గించుము. కోరికలుజన్మహేతువులని తెలిసికొనిన బుద్ధిమంతుఁడా కోర్కెలను బూర్తిగా నిక్కడననుభవించి నిష్కాముడు కావలెను. అశాంతికి కారణభూతమైన యీలౌకికద్రవ్యమునార్జించుటయందే గడుపుచున్నారుగాని, సుస్థిరమైన బ్రహ్మజ్ఞానద్రవ్యసంపాదనకుఁ గడంగకున్నారు. అదియే నావిచారము.

శ్రీగణేశాయనమః

8-11-1955

కమాల్గంజ్

## సనాతన ధర్మమునకు జయమగుగాక!

ఈవ్రతానుష్ఠానము శారీరకబలసంపత్తి కుంటువడినను, మానసికబల మితోధికమగుటకును తన్మూలముగా లోకకల్యాణము జరుగవలెననునూహాతో సంకల్పించితిని. సర్వాంతర్యామియైన పరబ్రహ్మము విశ్వమునందన్నిటఁ జైతన్యరూపుఁడై వెల్గొందుచున్నాఁడు. అఖండస్వరూపమైన భగవంతునెవ్వరు నాధారింపలేరు. అది బుద్ధికతీతమైనపని. అవ్యక్తచింతనమసాధారణమైన విషయము. ఈసాధనానురక్తియుఁ బూర్వజన్మవాసననుబట్టి యుండును. శంకరాచార్యులవారంతటి యద్వైతాచార్యులైనను గడకులోకసంగ్రహార్థము దాను సగుణోపాసకుఁడై గుణగానముగావించినాఁడు. యోగియైనను సగుణారాధనాతత్పరుఁడైననాఁడుగాని బ్రహ్మమును జెందుట కష్టమని

భాగవతప్రవచనమున్నది. కావున నేనిప్పుడు మహాపూర్ణుడగు రుద్రు నుపాసించుచున్నాను.

గ్రంథసహాయమున నీక్రిందివిషయము తెలుగవచ్చును. ఈశ్వరుడు మేరుకైలాసశిభాగమున నుండును. ఆమేరువు సప్తసముద్రలను దాటినగాని దృష్టిగోచరముకాదట. లవణసముద్రము, ఇక్షుసముద్రము, సురాసముద్రము, ఘృతసముద్రము, దధిసముద్రము, క్షీరసముద్రము, శిమ్నల పరిశుద్ధజలాంబుధులున్నవనియు ఒకదానికంటె నొకటి క్రమ విస్తారము కలదట. అట్టిమహాదేవుని కైలాసస్థశైలజా మనోహరుని జపతపోనిష్ఠాధికములచే ప్రార్థించుచున్నాను. వినుతించుచున్నాను. వేడికొల్పించుచున్నాను. ఆవేదనపడుచున్నాను. ఎప్పటికప్పుడే వ్రతానుష్ఠానకాలమందు ఉర్ధ్వభాగమైనది, ఆదేవదేవునికై ప్రత్యేకమగు నొకయాసనము కల్పించితిని. అపవిత్రమూర్తి దర్శనమేనాడైన నిర్భాగ్యునకుఁ గల్గునా? యనునావేదన నాహృదయమునందు బయలుదేరును. గజేంద్రుఁడు "లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ... కావవే ... సంరక్షింపుభద్రాత్మకా!!" యను సంబోధనతో మొఱపెట్టుకొన్నట్లు సంసారభ్రమణచక్రస్థితుడనై నేనుఁగూడ నాక్రందించితిని. అక్రూరునివలె నాశ్రీపతిని వేడుకొంటిని. మొత్తము మీద వ్రతకాలమునందు సాధ్యమైనంతవఱకు లోకాభిరామాయణ ప్రసంగవ్యవహారాల కవకాశమీయలేదనియే చెప్పవలెను. జపకీర్తన చింతనమనన శ్రవణాదికవిధివిధానములచే రేయింబవళ్ళు గడుపుచు వచ్చితిని. స్వల్పవిషయములందు తుచ్ఛమైన మనస్సు ఆకస్మికముగాఁ బడిపోవును. అపతనావస్థనుండి మేల్కొనుమని భగవంతుఁడే ఆదేశించినాఁడు. ఆకారణముచే సాధ్యమైనంతవఱకు చిత్తమన్యాయత్తముగా

కుంకుమల్లుకృషిచేయుచున్నాను. దోషస్వల్పములనుండి కేవలనైత్రింజసిన చిత్తమున నుదారాశయములునయించి ఫలించుటకు, ఇక్కడి యవకాశములున్నవి.

ఆజగదేక సుందరుని దివ్యదర్శనమే నాకు కల్గునో!! నాహృదయస్థమైన ధ్యానాదికములు నిష్ఫలములేనా? అయినచో నిరోపజాకుందనకృపామృత ధారలు వర్షింపక నానదీక్షు సహించునా? యనునదృఢయేర్పడును. బహువ్యాపకుండైన యామహానుభావుని పరిపాలనా వ్యవహారములోనాసంగతి పడినదో లేదో తెలియదు. ఆయనకు తీఱికెక్కడిది? ఆతనికెందఱు దాసులు, పవిత్రప్రేమికులున్నారో!! వారి యోగ్యతాదికముల యెదుట నాస్థితియెంత? నామొఱయాపద్మాఖుని శ్రవణపుటములందొక్కసారైనా పడినదా? పడినచోనుపేక్ష యేలవహించును? ఆతఁడు శరణాగతరక్షాదక్షుఁడే!! పూర్వము కష్టపరంపరలలోఁబడిన పుష్పదంతుఁడను గంధర్వుఁడు నలువది మహిమ్నస్తోత్రములు వ్రాసి స్తుతించి నిర్గతపాపుఁడైనట్లు వదంతి గలదు. చేసిన యపరాధములు క్షమింపఁబడుటకు జగద్గురు శంకరాచార్యులు వారుగూడ యపరాధ శ్లోకములను రచించెను. ఇవన్నియు దృష్టిలో నుంచుకొని మత్కృత పూర్వాపరాధనివారణార్థము మద్రపూజా ప్రార్థనలు సల్పుచున్నాను. ఉదయము పూజాసమయమున నేను వేలు మంత్రోచ్చారణముగావించుటవలన కడుపులోనరములనొప్పి యెక్కువగుచున్నది. ఈ బాధ యీనాటితోఁ దీరునా? ప్రతిదినముండునదియేగదా!! నాశారీరక బాధయెవరితోఁ జెప్పుకొందును? అన్నిటికి నాదిక్కా దయానిధి తప్పనన్యమెవరునులేరు. వాఁడేగతి యని త్రికరణశుద్ధిగా నమోవాక్యములర్పించుచున్నాను.

శ్రీ గణేశాయనమః

ది 22—12—1955.
కమాల్గంజ్.

## సనాతన ధర్మమునకు జయము గల్గుగాక !!

శ్రుతి స్మృతి యని రెండు విధములు. వేద వాక్యములకు శ్రుతి వాక్యములందురు. దాని ననుసరించి ఆ ఛాయలలో సంగ్రహరూపమునందు స్మృతికి దేఁబడినది స్మృతియందురు. మానవుఁడు భూత వర్తమానకాలసంఘర్షములవలన మనోబుద్ధి చిత్తాహంకారములకు లోఁబడియుండును. కామినీకాంచనాదిక లౌకికవిషయములు ప్రాప్తించినతోడనే తృప్తిపడి, మఱల వాని వియోగమున మిగులదుఃఖించుచుందురు. కొన్నాళ్ళు భోగమనుభవించినతర్వాతకూడ నితరుల సొత్తపహరించియైన ననుభవింపఁగోరును. భూతభవిష్యద్వర్తమానములయందలి యనుభవరూపమే స్మృతిరూపకమైన స్వప్నమున ప్రతిఫలించుచుండును. ఇదిపరికించినచోఁ జాలనాశ్చర్యము కలుగుచుండును. అందుచే సత్సంకల్పము, సాధుసాంగత్యము, సర్వదా పరమేశ్వరుని గుణగానశ్రవణమననిధి ధ్యానములున్న యెడల మాయావరణముదొలఁగిపోవును. నిత్యమైన బ్రహ్మపదార్థగతశుద్ధవిజ్ఞాన ముదయించును. అనఁగా మానవునకత్యవసరమైన సాత్త్విక విజ్ఞానము కలుగునన్నమాట. సంసారబంధములనా సత్త్వగుణమే తొలఁగింపఁగలదు. సత్త్వగుణము నిత్యపదార్థమునందు సుస్థిరలక్ష్యమునుంచును. ఈ సత్త్వగుణమును బెంపొందించుకొనుటకుఁ గొన్ని సాధనములు సూచింపఁబడినవి. 1. సాత్త్వికాహారమును దీసికొనుట. 2. సాధుసాంగత్యము. 3. సద్గ్రంథపఠనము. 4. ఏకాంతావాసము 5. సతతం

భగవన్నామగుణగానములను నీ సాధన ప్రకరణములవలన మానవుఁడు శుద్ధసత్త్వుఁడగుచున్నాఁడు. కావుననే ముక్తసంగులై మహాత్ములు పవిత్రాంబుపరిపూర్ణనదీతటపటకుటీర నివాసము చేయుచు ననూల్ప బ్రహ్మజ్ఞానమకరందసముపార్జనము సేయఁగల్గినారు.

నీచసంపర్కమువలన హృదయము పంకిలమైపోవును. నాంసారికతాపత్రయజ్వాల నాత్మనిని దహింప మొదలిడును. పూర్వజన్మమునఁ జేసిన దుష్కృతమే తిరిగి మన బుద్ధులలోఁ బ్రవేశించి పాపకార్యములు చేయుటకుఁ బ్రోత్సహించుచుండును. పూర్వజన్మ సంస్కారములవలననో, ప్రస్తుతజీవితములోని సంగదోషముననో యాయాభావములు స్మృతికివచ్చి దివ్యమైనజీవితమును బాడుచేయును. త్రిగుణ సహితమైన మాయచేఁదానుజేసిన పుణ్యపాపములు సంస్కారమునొంది బ్రహ్మప్రళయానంతరము సస్యరూపమున నుద్భవించునని పెద్దలందురు. పూర్వ పాపపుణ్యఫలితానుసారమీప్రాణికోటికి జన్మకర్మలు ప్రాప్తించునని తెలియుచున్నది. కావున మంచి నిష్ఠవహించి, శాస్త్రవిహిత సమాచరణమొనర్చుచు, మఱలజన్మకురానియట్లు నిష్కాములగుటకుఁ బ్రయత్నింపవలెను. పరిశుద్ధవిజ్ఞానమువలన మలినమాయావరణ నిక్షేపములు దొలఁగిపోవును. కోరికలు నశింపవలెనన్న దృఢతరజ్ఞాన సంపదయవసరము.

తాత్కాలికముగా వచ్చుసుఖభోగములకుఁదృప్తిచెంది, నిత్యవస్తువునే మఱచుట ప్రజ్ఞావంతుని లక్షణము కానేరదు. ఒకసారి యనుభవించినదానినే తిరిగి యనుభవింపవలెనను నింద్రియ మోహాజనితమైన మనస్సు నిలుకడలేక యావిషయ ప్రపంచమునే స్మరించును. ఒక్కక్షణముక్రిందట రుచ్యపదార్థములను తిందుము., కాని కొంతసేపటిలో తిరిగి మఱియొక మధుర పదార్థము కావలెలని మనస్సా

కాంక్షించును. ఇట్టి తదితర దర్శన, శ్రవణ, స్పర్శాదికములవలన నేర్పడు నీవిషయ కౌల్యము సుస్థిర బ్రహ్మజ్ఞానమును హానిచేయును. త్రికాలబాధ్యుఁడును, సర్వసాక్షిస్వరూపుఁడును, ప్రణవాత్మకుఁడైన సర్వేశ్వరునియందే మనోబుద్ధులనుంచవలెను.

పరబ్రహ్మస్వరూపమునకు నామరూపక్రియలు లేవు. కావున ప్రణవమే సర్వదా యనుసంధించవలసి యున్నది. రామకృష్ణాది సగుణమంత్రోచ్చారణమును మఱల పునర్జన్మకుఁ గారణమగుచున్నది. జన్మరాహిత్యమునకు ముఖ్యహేతువైనది ప్రణవస్మరణమే. జ్ఞానోదయముకల్గినతరువాత నీభేదములంతగాఁ బాటింపనవసరములేదు. ఏయాశ్రమమునందున్న నుభయము లేదు. పరిశుద్ధవిజ్ఞానముతో ప్రదర్శింపవలెను. విషయములన్నియు సంక్షేపములుగాను, తర్వాత క్లుప్తముగా వ్రాయుచున్నాను. ఆపన్నివారకుడైన పరమేశ్వరుని కరుణాకటాక్షవీక్షణము వలన మఱల నీభక్తిజ్ఞానవైరాగ్యములకు సంబంధించిన ప్రసంగములో నొకప్పుడు' చేసికొందము. ఇపుడిచ్చటఁ జలి విస్తారముగా నున్నది. రాత్రివేళ మాతృగర్భస్థమైన శిశువువలె పరుండవలసివచ్చుచున్నది. తెల్లవారుఝామున గ 4-30 లకు స్నానము చేయుటవలన శరీరము చీలిపోవుచున్నది. రాత్రి పగ లొక్కవిధముగా నుండును. రాఁగల మూఁడుమాసములు భగవంతుఁడెట్లు సంరక్షించునో తెలియుటలేదు. ఇంతకుఁబై నున్న హృషీకేశము-హరిద్వారము మున్నగు పుణ్యక్షేత్రములందు నిల్చి వ్రతానుష్ఠానముచేయుటలో గొప్పతనము లేకుండునా ? ఉత్తరదేశములో జ్ఞానకాండము హెచ్చుగానుండును. దక్షిణాపథమున కర్మకాండ యధికముగానుండును. ఇంతేవిషయములు.

శ్రీ గణేశాయ నమః

ది 16-1-1956

కమాల్గంజ్

# సనాతన ధర్మమునకు జయమగుగాక!!

జీవన్ముక్తికి ముఖ్యముగా మాయాసంబంధమైన విషయముల యందు, ఉపరమము లేదా ఉపరతియనికూడ వ్యవహరింతురు. ఈ రెండు పదములకునర్థమొక్కటియే. తరువాత వైరాగ్యము. ఉపరామత యనగా నన్నిపదార్థములయందును దనకు వాంఛ లేకుండుటయే. వైరాగ్యమనగా సాంసారికవిషయములయందు వ్యామోహము లేకుండుటకు ప్రయత్నించుట. ఉపరామత యనగా తీర్థయాత్రల యందుగాని, కామినీకాంచనములయందుగాని, షడ్రసోపేత భోజనములయందుగాని, మద్యమాంసాదికాహారభక్షణమునగాని, యిచ్ఛ లేకుండుట. ప్రాపంచికవస్తుజాలమునందభిమాన మోహములేకుండ నుండుటయే వైరాగ్యమనబడును. ఇది యభివృద్ధికావలెనన్న సాధు సజ్జనగోష్ఠి, ఆత్మవిచారణలవసరము. మనోవాక్కాయకర్మలచే నిరంజనుడైన భగవంతుని ధ్యానాదికములందు తైలధారావత్చిత్తముండుటయే యుపరతి యనబడును. జ్ఞానమును మూడువిధములుగా విభజించుచున్నారు 1 జడవస్తువులయందుపేక్షాభావము 2 శాస్త్రవాక్యాంగీకారము 3 గురువాక్యవిధేయతలను నివి మూడులక్షణములు గల తెలివియే జ్ఞానమగును.

ఉపాసనమనగా భగవత్సమీపమునందున్నాడను విజ్ఞానముతోనే లౌకికదోషమంటకుండచేయునే పూజాదికవిధానప్రక్రియ ఉపాసన. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన

ధారణ సమాధ్యష్టాంగయోగములలో నొకభాగ ముపాసనమై యుండుటచే దానిని జక్కగా నలవఱచుకొనవలెను. ఉపాసనకు ముఖ్య సాధనములు నిత్యనైమిత్తికకర్మలు. నైమిత్తికకర్మలనగా స్నాన సంధ్యావందనములు, పూజాశాస్త్రశ్రవణమననిధి ధ్యానాదికములు. ఇట్టివి సాధకుఁడు బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థుఁడు, సన్న్యాసి యనునాల్గాశ్రమస్థులుకూడ తామరాకుపై నీటిబొట్టుచందనమున వ్యవ హరించినచో నేప్రమాదముండదు. సంసారికెన్నో ఋణానుబంధ ములు తీర్చవలసియుండును. అవితీర్చక మనకుసుఖము కలుగదు. ఆవిధముగనే ఆగామి, సంచితప్రారబ్ధముయొక్క ఋణము. మలిన, ఆవరణ, విక్షేపములయొక్క ఋణము, తీర్చినయనంతరము జీవుఁడు ముక్తిపొందును. సాధ్యమైనంతవఱకుఁ బ్రయత్నించి ఋణానుబంధ ములుతీర్చి కృతకృత్యుఁడగుచున్నాఁడు.

నైమిత్తికకర్మ, ఉపాసన, జ్ఞానము మూఁడువిధములు. కర్మా చణరమున సామాన్యమైన పడవనెక్కి కొంతకాలము దరిచేరును. ఉపా సనాపరుఁడులంగరువేసినపడవనెక్కి కొన్నిసంవత్సరములకు, దరిచేరును. జ్ఞానానుష్ఠానపరుఁడు, స్టీమరెక్కి శీఘ్రముగాఁ బ్రయాణముచేసి మోక్షము పొందును.

లంగరువేసిన పడవలో ప్రయాణముచేయువారిననేకమైన సుడిగాలులెదుర్కొని యథాస్థానమునుచేరనీయక మధ్యలోముంచి వైచును. ఈవ్రతానుష్ఠానము ప్రారంభించి సుమారుపదిమాసము లైనది. ఈపదిమాసముల కాలముకూడ నాసర్వేశ్వరుని అపారకృప వలన స్వప్నములవలె గడచిపోయినవి. ప్రథమములో రాక్షసులబాధ, పశువులబాధ, కుక్కల కోఁతులబాధ, విషసర్పాల, తేళ్ళ, కాకుల, చిలుకల, ఉడుతల యెలుకలు మున్నగు వానివలన శరీరబాధ — భోజన

పూజనద్రవ్యభంగములు కలిగినవి. గ్రీష్మకాలమున నెండ, వర్షకాలమున వర్షము, శీతకాలమున చలిగాలి మిక్కుటముగానుండుటచే నేను క్రమముగా నిత్యకృత్యములు యథావిధిగాఁజేసికొనలేని దుస్థితికి వచ్చితిని. కాళ్ళు పట్టుపట్టినవి. శరీరబాధయిట్లుండగా నంతఃకరణ ప్రవృత్తి యపుడపుడు పెడమార్గమునఁబ్రవర్తింపఁబోయెడిది. ఇన్ని బాధలకు గుఱియైనను — భారమంతయు నా దేవదేవునిపై నిడి అదే ధ్యానము చేయుచుంటిని. ఏకపుత్రుఁడు మరణించినపుడు విలపించు తండ్రివలె, నూత్నముగాఁ బెండ్లియాడినభార్య కాలధర్మముపొందినపుడు భర్తయేడ్చునట్లు, భర్త యచిరకాలములో మరణింపగా నేడ్చు నవనారివలె నేదిక్కునులేక యీశ్వరా!! మహాదేవా!! రక్షకా!! యని ప్రార్థించుచున్నాను. మూలవ్యాధిపీడాగ్రస్తుఁడనై యెంతో బాధపడఁజొచ్చితిని. గ్రామములయందుఁగంటె నిర్జనప్రదేశముల యందు చలియెక్కువగానుండును. నాకష్టము లెవరితోఁజెప్పుకొందును. నాలౌకిక నేత్రముల కెవ్వరగుపించుటలేదు. అంతర్నేత్రములకా దయామయుని దర్శనము కల్గునా? యనునా వేదన నాలోఁ బ్రతిధ్వనించుచున్నది. వ్రతానుష్ఠానము పూర్తియగుటకు దినములు సమీపించుచున్నవి.

శ్రీ గణేశాయనమః

తే 31-1-1956

## శ్రీ సనాతన ధర్మపతాకకు జయమగుగాక

ఇచ్చట పరమేశ్వరుని కృపవలన క్షేమము. మీరు బంధుజన పరివారసమేతముగా క్షేమముగా నుందురుగాక!! ఇచ్చట శీతోష్ణము లెక్కువగా నున్నవి. మేము ప్రయాణముచేయు మార్గము దట్టముగా మంచు గడ్డకట్టుటచే దారికూడ తెలియుటపచ్చుటలేదు. చలిగాలి యొక్క

వగా నుండుటచేత నూతినుండి నీరుతోడుటకూడ దుస్సహముగా నున్నది. శరీరముకృష్ణవర్ణమైనది. అప్పుడపుడు గమనవేగముల, శిశిరా ఘాతముచే పాదములు పగులుటయు, మోకాళ్ళు బద్దలై రక్తము స్రవించుటయు జరిగినది. రాత్రివేళలందు చలిగాలి ప్రచండముగా నున్నది. దానికిఁ దోడుగా మాకనువైన పచ్చడములు కప్పుకొనుటకు లేవు. చాలవఱకు నిశాసమయమున నిద్రపట్టెడిదికాదు. ఆ ప్రశాంత సమయమున పరబ్రహ్మ ప్రణవనాదమునే స్మరించుకొనుచు బ్రహ్మానం దమునందుచుండెడివారము. ఈలీల నిజముగా నాలోచించిన పురా సుకృతైక ఫలితమనిపించును. ఇన్నికష్టాలలోగూడనలభ్యమైన భగ చ్చింతనావిశేషమబ్బుట కాదుగదా!! ఇంకొక గొప్పవిశేషము. భగ వంతుడిచ్చిన నానేత్రములు సార్థకమగుచున్నవి. ఇక్కడ నాకనులకైన ప్రకృతిరామణీయకమును వ్రాతలో మీకంతగాఁ దెలుపలేకపోయెద నేమో యనుభయమగుచున్నది. ఉత్తుంగతరంగాలతో ప్రశాంతముగా ప్రవహించుచున్న గంగాభవాని ఆప్రాంతమునందున్న అరణ్యాసీమలు ఆభూములలోనందందుఁగల యిసుకతిన్నెలలోనడచునపు డూహింప రాని యొకరసానుభూతి యేర్పడినది. ఆనాడు హృదయవీధిలోనవ్యక్త భావజాలమపారముగాఁ బొంగిపొరలినది. కొందరొక్కవస్త్రముతో నొక్కయిసుక ప్రదేశమున, మఱియొకరొక్కచెట్టునీడను కొందరొక మాఱుమూలల నివసించుచున్నారు. వారుగొప్పపాండిత్య ప్రతిభా శాలురైనను శరీరాభిమానము చెంతకురానీయని వారివైరాగ్య తత్త్వము ప్రశంసాపాత్రముగదా!! వారందరును మహాత్ములే!! బ్రహ్మ జ్ఞానులే వారి దర్శనము చేసికొనుచు ముందునకు సాగితిమి. మార్గమధ్య మున గృహస్థులు వానప్రస్థులు పర్ణశాలలు నిర్మించుకొని పరబ్రహ్మాంశ లైన శివ, రామ, కృష్ణేత్యాది దైవముల నామస్మరణామృతము గ్రోలుచుండగా విని మేమానందపరవశులమయ్యెడివారము. ఈయను

భవముగడచిన నాపదునేను వత్సరాల జీవితమునందులేదనుట విచిత్ర ముకాదు. ఈయరణ్యవాటికలయందున్న గృహస్థులఆదరాభిమాన ములద్వితీయములు. వారియతిథియభ్యాగతభక్తితాత్పర్యాలు ఆదర ప్రాయములైనవి. ఒకదినమునరణ్యమార్గములో నడచుచుండగా కాలికి ముల్లు గ్రుచ్చుకొన్నది. అసలే చలిదేవుడు శరీరములో నొక్క నెత్తురుబొట్టులేకుండా పీల్చివైచినాఁడు. ఇప్పటికి కాశీనగరమునకు 500 మైళ్ళు దూరముగానున్న కర్ణవాసిపురముచేరినాను. ఈక్షేత్రముననే మహాదాత కర్ణుఁడు ప్రతిదినమొకమణుగు బంగారము దానముచేయు చుండెనట.

ఈ నదీప్రాంతమున కర్ణుఁడు, అశ్వత్థామ, కృపాచార్యులు, భీష్మా చార్యులు, శుకయోగీంద్రులు మున్నగువారు సంచారము చేసినారు. ఆప్రాంతమునగల యొక గ్రామవాసియైన వృద్ధబ్రాహ్మణుడు గంగకు స్నానమునకుఁ బోవుచుండగా నాతనికి నశ్వత్థామ కన్పించెనట. ఆ విషయమాతఁ డాయూరివారందఱ కెఱుకపఱచెను. ఈస్థలము హరి ద్వారమునకు సమీపముగా నున్నది.

నామనస్సంకల్పమింతవఱకును బూర్తికాలేదు. నివసించుటకు వీలైనచోట భోజనమువీలుగాకపోవుట వలనను — అందునొకచోట సర్వావకాశములున్నను వ్రతకాలమొక్క వత్సరమగుటచేనంగీకార ము కుదరలేదు. ఈశివరాత్రికి సర్వసామాగ్రి సమకూర్చుకొని యీ దీక్షావిధిని ప్రారంభింపనున్నాను. ఇంతవఱకుఁ గొంత పాదయాత్ర — ధూమశకటయాత్రచేయవలసి వచ్చినది.

ఒకసారి నేను గంగానదీ తీరములో ప్రయాణము చేయుచున్న పుడొక ధ్యానావస్థలో నొక పూర్వస్మృతి — తోచినది. నేను గడచిన జన్మలో వైదికబ్రాహ్మణునింట పుట్టితినట. ఋణభారము తీర్చుటకీ జన్మలోనిట్లు జన్మించితినను పూర్వవిజ్ఞానము కల్గినది. మఱియొక గొప్ప

విశేషమేమనఁగా నిందున్న సాధు సజ్జనుల సందర్శనమున విచిత్రమైన వైరాగ్యభావముదయించినది. చెంతనున్న వాని నన్నిటిని విడచిపెట్టివలెనంతటి విరక్తియగుచున్నది. దీనికి నిదర్శనముగా మొన్న 'పలాస' నుండివచ్చినపుడు నాదగ్గఱనున్న సామానులు, పుస్తకముల పెట్టె అన్ని విడచివచ్చితిని. ఈ చలిప్రదేశములో స్నానముచేయునపుడంగములేగాక వక్షస్థ్సలముకూడ వణికిపోవును. అందుచేతనే యీయుత్తర దేశీయులు 1-15 దినములకొక్కసారి స్నానముచేయుచుందురు. వైదికులు — నిష్ఠాపరులిట్లుగాక ప్రత్యహము స్నానమాచరింతురు రైతులు — శూద్రులు పై విధముగా నెప్పుడో స్నానముచేయుదురు.

ప్రస్తుతము కొంచెము చలితగ్గుచున్నది. గాలి యున్నపుడు చలియెక్కువగానుండును. ఇప్పటి యుపాసనాస్థలము గంగానదికి సమీపముననున్నది. గ్రామములకు దూరమందున్నది. నా నిశ్చయమిచ్చటఁ బూర్తిచేయ తలంపున్నది. నేనిచట సుఖముగానే యున్నాను. నాయునికిని గూర్చియు — నాసంకల్పమునుగూర్చి దైవతుల్యులగు మాతండ్రిగారికి తెలుపఁ గోరెదను. వారికి నానమస్కారములని చెప్పుఁడు. ప్రియసోదరులు టంకాల గణపతి శ్రేష్ఠిగారికి, మద్ది సత్యనారాయణగారికి నాప్రేమను దెలుపఁగోరెదను.

శ్రీగణేశాయనమః

ది 16—2—1956

కమ్లాంజ్

## శ్రీ సనాతన ధర్మమునకు జయమగుగాక!!

మానవజన్మదొరకుట కష్టము. ఇతర దేశములలోఁ బుట్టుటకంటె యజ్ఞభూమియగునీభారతావనిలోఁ బుట్టుట మఱింత యదృష్ట

మనకతప్పదు. పూర్వజన్మముననార్జించిన సుకృతిఫలమునుబట్టి యిట్టి స్థితిగతులుకల్గును. అందు స్త్రీ జన్మకంటె పురుషజన్మ యుత్తమ మందురు. అందునీచకులమునఁబుట్టక ద్విజులయందుద్భవించుట కష్టము. వికలాంగులు కాకుండ నంగసౌష్ఠవముతో నొప్పారుట కష్టము. నిరోగులై యుండుట కూడనదృష్టమే. శరీరము పుష్టికరముగా నున్నపు డంతఃకరణ ప్రవృత్తి బలముగా నుండును. ఈమాయాప్రకృతియందు భ్రాంతి చిత్తముననిమగ్నులు గాక తాననఁగానెవరో తెలియఁ బ్రయత్నించుట వివేకవంతుల ముఖ్యకర్తవ్యముగదా !! జీవుఁడు పరస్థితిని పొందినపుడు నిర్వికల్ప సవికల్పసమాధుల ననుభవింపవలసియుండును. జ్ఞాతృ, జ్ఞాత, జ్ఞేయ త్రిపుటీభావనాసహితమీయంతఃకరణప్రవృత్తిని పరబ్రహ్మమునందునిల్పుట సవికల్పసమాధియందురు. ఈ త్రిపుటీ సాధనానంతరము నిర్వికల్పసమాధి రెండువిధములు.

అంతఃకరణమునకు అద్వైతబ్రహ్మాకారవృత్తి యేర్పడినపుడే అద్వైతభావనారూప నిర్వికల్పసమాధి. అభ్యాసమధికమై యెపుడు శాంతివహించునో అనగా వృత్తి రాహిత్యము పొందునో దానినే అద్వైతస్థానరూపనిర్వికల్పసమాధి. సుషుప్త్యవస్థలో వృత్తిలయించును. అపుడజ్ఞానస్థితిలో నుండి యానందము పొందును. జ్ఞానులు నిర్వికల్ప సమాధిలోనున్నప్పుడే జ్ఞానముద్వారా బ్రహ్మానందమునుబొందుదురు.

## నిర్వికల్పసమాధిలోనున్న మహాత్ముల సంస్కారములు :-

కుమ్మరివాఁడు కుండలు చేసిన సమయములో చక్రము తిరుగుచుండి పిమ్మటఁ గూడఁ దిరుగుచుండును. అలాగుననే నిర్వికల్పసమాధి పొందిన పుణ్యపురుషులు పుణ్యపుంజముల సంస్కారముల ననుభవించుటకు ధరిత్రిపై జన్మించుచుందురు. అనంతరము జీవన్ముక్తి పొందె

దరు. నిర్వికల్ప సమాధిలోనున్న పుణ్యపురుషులు మరణానంతరము అంగారకమండలము, చంద్రమండలము, సూర్యమండలము, నక్షత్ర మండలము, మొదలైన మండలములను దాటి సృష్టికర్తయైన కార్య బ్రహ్మస్థానమున నీ సంస్కారమున బ్రహ్మ ప్రళయము వఱకుండి., పిమ్మట దశవిధనాములతోఁ నుండిన జీవ బ్రహ్మాండమైన ఓంకారముతో (ప్రణవముతో) నైక్యమందును. దీనికి మీఁదుగా ఓంకారశబ్దరహిత మైన విశాల బ్రహ్మాండము దీనికి మీఁదుగా నున్నది. మనమీ బ్రహ్మాండము క్రింది భాగములో నున్నందుననా ప్రణవనాదమును వినుచు నానందింప వలసిన దే.

శబ్ద రహితమైన విశాల బ్రహ్మాండము దీనికి మీఁదుగానున్నది. అది కేవలమీశ్వర కోటిలోనున్న జీవన్ముక్తులకే ప్రాప్తించును. అచట శబ్దశూన్యమై నిశ్చలముగానుండును. అచట బ్రహ్మప్రళయములో త్రిగుణములు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, మూలప్రకృతి, మాయ, ఈశ్వరుఁడిత్యాది మహాపురుషులు శబ్దరహితమైన బ్రహ్మాండములో నానాస్థానములందు వసించెదరు. బ్రహ్మసృష్టివఱకచటనేయుందురు. ఈవిధముగా శ్రుతిచెప్పుచున్నది.

(పాదోస్య సర్వాభూతాని త్రిపాదస్యామృతందివి) యజుర్వే దముయొక్క 31 శ్రుతిలో కార్యబ్రహ్మాండమంతయు, నాల్గవభాగము లోనొకేభాగములో నేయావద్బ్రహ్మాండ మిమిడియున్నది. ఈగతిం చిన పుష్యమాసములో నొకదినమున గాలివేసినందున నంతఃకరణ ప్రవృత్తి చలికోర్వలేక లోలోపలనే రోదనముచేయ సాగినది. విజ్ఞాన మంత్రముబాధ కొన్నినాళ్ళేయని యోదార్చెను. అనంతరము వర్షపు గాలులు వీచుటవలన శాలువలతో శరీరముకూడ హిమమయమై పోయినది. శాలువదిసేపుమాత్రము పరుండి యనంతరము ప్రణవ

నాదము అంతర్ధ్వనిగా వినుచు కాలక్షేపము చేసితిని. ఈమాఘమా సము ప్రారంభమైనకర్వాత చలిహెగ్గినది. ఇపుడు తృప్తిపడి నిద్రపోవు చున్నాను. గ్రీష్మ, వర్ష, శీత ఋతువుల కష్టములు మహాదారుణముగా ననుభవించితిని. ఇంకను భగవంతునికి దయకలుగలేదు. అందుచే నేమియౌదోచన్నది. కానియింతలో కొంతధైర్యము కల్గినది. పూర్వమర్జునుడు, మార్కండేయుడు మున్నగు భక్తాగ్రేసరులకు శరణ్యమైన సాక్షాద్దయానిధియైన శివశంకరుడొక్కడే గతియని నమ్మి తిని. ఈయుగారంభములో రామదాసు - అనంతరము 50 సంవత్స రముల క్రిందట రామకృష్ణపరమహంస, మొదలైన సాధక పురుషు లకు సాకారరూపముతో పరమాత్మ ప్రత్యక్షమైనాడు. కావున నీవ్రతానుష్ఠాన ఫలితమీశ్వరుడు తప్పక యిచ్చితీరును.

ఆ నిరాకర బ్రహ్మముద్వారా అనాదినుండి మూలప్రకృతి నియ మింపబడినది. అది యేమనగా మనమేవిధమైన కర్మచేయుదుమో అదేవిధముగా ననుభవింపవలసియున్నది. ఇది శాస్త్రవాక్యము. గురు వాక్యముకూడ నై యున్నది. ఇదిస్వానుభవసిద్ధమైనది. ఈమూడును ననుభవప్రమాణములు కావున సుఖదుఃఖములను తగ్గించుటకు, బ్రహ్మ విష్ణుమహేశ్వరాదులకు గూడ తరముగాదు. యద్భావం తద్భవతి యను సిద్ధాంతమురీత్యా నిష్కల్మషముగా సంకల్పించిన యీయనుష్ఠానము నిర్విఘ్నముగా కొనసాగ గలదని - ఫలించునని నాదృఢవిశ్వాసము. పరమేశ్వరునికరుణ యేలాగున్నదో చెప్పజాలను. కేవలమునేనొక పిచ్చివానివలె నున్నాను. పరమేశ్వరునియెడశ్రద్ధగలవారు, మంచి సుగుణాలు కోరుకొనెడివారు, రాత్రి సుమారు గ 9 లకు నిద్రపోయి, బ్రాహ్మీముహూర్తమున అనగా గ 4 లకు లేచి నిశ్చలముగ బ్రహ్మధ్యా నము చేయుచు ప్రణవనాదము వినెడువాడు భూతకాలములో దాను

దెలియకచేసిన దోషములన్నియుబోయి చిత్తశుద్ధికల్గును. కావున సాధ్యమైనంతవఱకుఁ బరమేశ్వరుని చింతనము సేయవలెను. ఆపరమాత్మనిదక్క నన్యములను నమ్ముకొనెడువారు హతాశులగుచున్నారు.

శ్రీ గణేశాయనమః.

14—3—56
కమాల్గంజ్

## శ్రీసనాతన ధర్మమునకు జయముకల్గునుగాక

సర్వమతాంతరములయందు, సర్వనామములయందు, సర్వభోగములయందు, సర్వక్షేత్రములయందు, సర్వవస్తువులయందు, సర్వకార్యములయందే నాడీయంతఃకరణప్రవృత్తికినీ యనిత్యమైన తుచ్ఛపదార్థములయందు ప్రేమ, ఆకాంక్ష, యిచ్ఛ, యుండదో ఆనాటికే వివేక విజ్ఞానమువలన నద్వైతసిద్ధి ప్రాప్తించి — ప్రాణముండగనే ముక్తిపొందును. పునర్జన్మలేనటువంటి పరమపదప్రాప్తి లభించును. అంతవఱకు మూనవుఁడీ నానావిచిత్రసంసారవిషయములయందు మోహాసురక్తి వహించును. ఒకసమయములో దుఃఖించుచు, మఱియొక సమయములో సంతోషించుచు — కాలచక్రములోఁబడి గిరగిర తిరుగుచు ప్రపంచములో కర్మానుసారముగా జన్మింపవలసినదే. మతములన్నింటికొక శాసనకర్త యున్నాఁడు. అద్వైతమతమునకు శాసనకర్తలేఁడు. పరమాత్ముఁడు స్వయంప్రకాశకుఁడు. అతఁడాద్యంతములు లేనివాఁడు. జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలయందు దృష్టిలేని జ్ఞానులు ఆత్మయందు రమించి జీవన్ముక్తులగుదురు. జాగ్రత్స్వప్నసుషుప్తిస్థూల, సూక్ష్మ, కారణ, విశ్వ, తైజస, ప్రాజ్ఞయనామరూపములు భోగ్యవస్తువులు. ఈమూఁడింటికి సాక్షిరూపమైన

కూటస్థమునం దేమానవుఁడు ధ్యానముంచునో వానికిఁబునర్జన్మలేని పరమపదము ప్రాప్తించును. విషయములందనురక్తమైనబుద్ధి పునర్జన్మకు దారితీయును. సకలపదార్థములు నీచములగుటచే బుద్ధివానియందుఁ బడుటచే దానికి నీచత్వము పట్టును.

ఏ పదార్థములయందు మనము ప్రేమనుంచెదమో అవియే బుద్ధియందు స్థిరపడును. ఆ పదార్థములయందే అనేకసంకల్పములు బుట్టును. ఆ సంకల్పములే మనలను కట్టివైచును. ఈశ్వరునిద్వారా చెప్పఁబడినట్టి వస్తువులు మాయాసంసారబంధముతో ముంచక పరమ పదవికి దారిచూపును. కాని మనయొక్క అంతఃకరణములోఁ బుట్టిన మనోమయవస్తువుల వ్యామోహము బంధమగుచున్నది. బోధనా రూపమగు చీపురుద్వారా మనోమయమగు గృహమునుండి దృశ్య రూపమగు తుక్కును పరిశుద్ధముచేయవలెను. శరీరమాయావస్త్రము చలి యున్నంతవఱకుఁగప్పుకొన్నాము. చలి తీరినతర్వాత పాఱ వైతుము. ఆలాగుననే మాయాప్రపంచమునందెంతవఱకు ప్రేమలేక భ్రాంతియుండునో అంతవఱకు ప్రపంచవాంఛలయందుంటిమి. ఏనాఁడు సత్పురుషులవలనఁ బరిశుద్ధజ్ఞానముదయించునో యానాఁడే యాభ్రమ పోవును. గర్భపాత్రలోఁబడిన వీర్యము చేతనమై అచేతనముద్వారా శిరస్సు, చేతులు కాళ్లు, మొదలైన యవయవములనునంకురముత్ప న్నమై, అవియే కొలదికాలములోనే క్రమక్రమముగా బాల్యయౌవన కౌమారవృద్ధావస్థలతో ననేకసంవత్సరములు శరీరము ధరించి, చూచుట, వినుట, యిత్యాదివిషయములు తెలిసికొనును. తరువాత చనిపోయి బూడిదయగును. మట్టియగును. దీనికంటె మించిన మహేంద్ర జాలమేమున్నది ? విజ్ఞానులయినవారు. పండితులగువారు, పరమ భక్తులగువారు, మొదలైన మహాత్ములీ యింద్రజాలమును జూచి,

తమలోఁదాము నవ్వుకొనుచున్నారు. మిథ్యాప్రపంచములోని మాన వులకిందు విరక్తి కలుగదు. ఆత్మవిచారణ గలవారు — లోకము పోకడ గుర్తించిన బుద్ధిమంతులు పెక్కు శ్రమదమాదుల నోర్చి కడకు మోక్షార్హమైన స్థాయికిఁ జేరుకొనఁగలరు. ఇవి చెడ్డవి., యివి మంచి విషయములని తెలిసియుండియు — సన్మార్గమునందుఁబోక చెడ్డగాఁ బ్రవర్తింతుము. భగవంతుఁడీ మాయ దేవతనతిచిత్రముగా సృష్టించి నాఁడు. ఈ మాయకిద్దరుపుత్రులు. ఒకఁడు జీవుఁడు. మఱియొకఁ డీశ్వరుఁడు. వీరిద్దరు మాయాసంస్కారముయొక్క పాలు త్రాగు చుందురు. మాయాసంబంధజీవికాకలిక్లును. చిదాభాసునకాకలి దప్పిక యెప్పుడుండదు. చిదాభాసమగు పరబ్రహ్మస్వరూపమును వేదాంతులు శ్రవణ, స్మరణ, మననములు చేసి జీవన్ముక్తి పొందె దరు. ఇదియే జీవన్ముక్తికిఁ జివఱిమెట్టు. పిల్లలకు ఱెక్కలు గట్టిపడు నంతవఱకును దల్లి దానిని బాధ్యతతోఁ గాపాడుచుండును. ఱెక్కలు దిట్టపడినవెంటనే ముక్కులతోఁ బిల్లలనుబొడిచి స్వతంత్రజీవనమునకై పొమ్మన్నట్లు తొలగించును. అటులనే యేనాడు మనవిజ్ఞానము పరిపక్వమగునో ఆనాడీమాయాసంసారబంధములను తొలఁగిపొమ్మని భగవంతుఁడు జ్ఞానవిత్తములగు గురుదేవులనాజ్ఞాపించును.

బుద్ధికగ్రభాగములోఁ జిదాభాసముండును. పెద్దలు దానినే జ్ఞానమందురు. మలినావరణవిక్షేపములు తొలఁగిన తరువాత మనలను ప్రారబ్ధకర్మయేమియునుజేయఁజాలదు. ఎంతవఱకు సత్వరజస్తమో గుణాజ్ఞానమునందుఁబడియుందుమో అంతవఱకే ప్రకృతిలోఁబడికొట్లా డకతప్పదు. ఎపుడు విషయవిరక్తికలిగి వివేకోదయమగునో అపుడే ప్రశాంతమైన ముక్తిచేకూరును. అరచేత నిమ్మపండున్నట్లు మోక్షము కైవసమగును. 1. అజ్ఞానము. 2. ఆవరణ. 3. విక్షేపము.

4. పరోక్షము. 5. జ్ఞానము. 6. అపరోక్షము. 7. తృప్తి. ఈ యేడును దృష్టాంతములతోఁ జూడవలసియున్నది. ఈ సప్తశ్రేణుల యనంతరము చిదాభాసముండును. ప్రారబ్ధకర్మజ్ఞానముద్వారా నివృత్తికానపుడు అనుభవించితీరవలెను. విద్యారణ్యస్వాములు పంచదశిలో నీవిధముగాఁ జెప్పియున్నారు.

నా కనుష్ఠానముయొక్క సర్వకార్యములు జయప్రదముగాజరిగినవి. ఆ కరుణాపూర్ణుని దర్శనమే లభింపవలసియున్నది. పూర్వకాలమున నఖండదాతృతాచక్రవర్తియైన శిబిరాజపుంగవుఁడు తన శరీరమును కోసి ధర్మదీక్షను నిలువఁబెట్టిన యాదర్శమును దృష్టిలోనుంచుకొని యీనావ్రతానుష్ఠానాంతిమదివసమున నా శరీరములోని యొక యవయవమును ఛేదించి తద్గరుతరరుధిరధారలచేఁబరమేశ్వరునభిషేకింతును. ఈవ్రతానుష్ఠానము ఫాల్గుణబహుళ అధికైకాదశీ దివసమునకుఁబూర్తి యగును. అనఁగా ది 7-4-1956 తో సమాప్తి చెందును. అనంతరము జపము 24 లక్షలైనది. తద్దశాంశము 240000 పునశ్చరణ జపమైనది. 24000 మంత్రముల హోమము. తద్దశాంశము 2400 తర్పణము. తద్దశాంశము 240 మార్జన. తద్దశాంశము 24 మంది బ్రాహ్మణులకు భోజనము. ఈవిధమైన శాస్త్రోక్తవిధానము జరుపఁబడును. ఇపుడు హరిద్వారమున కుంభమేలా జరుగుచున్నది. అది చూచికొని తత్సమీపముననున్న గంగోత్రి యమునోత్రి కేదారమిత్యాది పుణ్యక్షేత్రములు సేవించుకొని వైశాఖమాసములో రాజమండ్రి (గోదావరి) పుష్కరములకు వచ్చుచున్నాను. ఈ సత్కార్యమునకు శాంతిసంతర్పణ జరుగవలెను. ఈశ్వరరానుగ్రహమెట్లున్నదో చెప్పలేము. ఈ సంతర్పణమునకు సహాయమొనర్చుటకు మీకుఁదలంపున్నచో నీమీఁదసూచించిన తేదీనాటికి ముందుగా పైకముపంపవలెను. నాపు

యాణమునకు - సంతర్పణమునకు విరివిగా ద్రవ్యమవసరము. సర్వేశ్వ
రుని కరుణావిశేషముగానన్నియు జరిగితీరును.

శ్రీ గణేశాయనమః

17-4-56
కమాల్ గంజి

## శ్రీ సనాతన ధర్మమునకు జయమగుగాక !!

ఇచ్చటనున్న కొందఱు వ్రతానుష్ఠానము పూర్తియైనతరువాత
40 దినములు జపము చేయవలెనన్నారు. దానితో నామనస్సు చాల
ఖేదపడసాగినది. ఆరాత్రి భగవంతునిమీద భారమువైచి యట్లే
యాలోచించుచుంటిని. అంతలోఁ జక్కని యాలోచన యొకటి పొడ
కట్టినది. అదియేమనఁగా పునశ్చరణ, హోమము, మార్జన, తర్ప
ణము, బ్రాహ్మణభోజనము, మొదలైనవానివిషయమైజపముగావించి,
ప్రయాణము చేయుటకు సిద్ధపఱచుకొని - ముఖ్యమైన వారికీవిషయ
యమును తెలియపఱచితిని. సర్వజపముచేసి పరమేశ్వరునకొక నమ
స్కారముచేసి 12 వ తారీఖున వెళ్ళుచున్నట్లొక చీటి వ్రాసి పంపితిని.
దానితో నాగ్రామమున సంతర్పణనిమిత్తము రు 200 లు చందా
వసూలైనది. అచ్చటనున్నవారు ముహూర్తమును జూచి తే 14-4-56
తారీఖునాటికి నన్నియుఁజక్కపఱచి పంపెదమన్నారు. నేనందుల
కట్లే యని యంగీకరించితిని. నామనస్సునమన్న యన్నియభిలాష
లును పూర్తియైనవిగాని యీశ్వరప్రత్యక్షభాగ్యము కలుగక పోయె
గదా !! యనుచింత నన్ను వేధించుచుండెను.

ఆ మఱునాడు సంవత్సరాదియగుటచే యథాప్రకారము
పూజలుచేసి, రాత్రి గ 9 లనుండి పూజ విరమించుకొని - కొంచెము

ఫలహారము దీసికొని - యనంతర మీనాడెట్లులైన నీశ్వరసాక్షాత్కారము కావలెనని ఘృతదీపము - అగరువత్తులు, కత్తి, కట్టి మంచినీళ్ళు దీసికొని యాలయమున ప్రవేశించితిని. ఎప్పుడు నంత నిశ్చలముగా లేని జపమానాడ ఖండసౌఖ్యము నిచ్చుచు 4,5 గంటలట్లే సాగినది. జప - స్తోత్రవిధానములు సక్రమముగా జరిగిన పిమ్మట నేను కత్తిని చేతదాల్చి శివనామమును జేయుచు చిటికెనవ్రేలి వైపునకుఁ జూపితిని. చాల భయమైనది. అట్లే నామోచ్చారణము చేయుచుఁ జివఱకా చిటికెనవ్రేలి సగభాగము ఛేదించి మహాదేవునకభిషేకము చేసితిని, గ్లాసెడు రక్తమైనను స్రవించినది. ఆలయమంతయు రక్తసిక్తమైనది. ఈశ్వరుని దర్శనము కాలేదుగాని ఆత్మానందమధికముగా లభించినది. శేషసత్కార్యములన్నియు జయప్రదముగా జరిగినవి. ఆరాత్రి నిదురపట్టవేదు. ఈ చిటికెనవ్రేలిని ఛేదనసేసిన సంగతి గ్రామజనులు విని చాల భయాక్రాంతులైనారు. వారు చేసెదమన్నటులు సంతర్పణ జరుపక పోవుటను మనస్సులోనుంచికొని నేనిట్లుచేసిన పిమ్మట గ్రామస్థులాచంద్రద్రవ్యము నెవరిది వారి కిచ్చివైచితిమనిరి. నాసంకల్పము నెఱవేరినది. తరువాత మీయిచ్ఛాను సారముగాజరుపుకొనుఁడని యంటిని - వారు తొలుతనావిధముగాఁబలికి యట్లుచేయకపోవుట యనునపరాధము వారిని పీడించినది. అందుచే వారు తే 15—4—56 దీని అఖండరామాయణము - వేదపారాయణ-హోమములును, తే 16—4—56 దీని సంతర్పణము కూడ సవ్యముగా జరిపిరి. తరువాత డాక్టరుగారువచ్చి తెగిన వ్రేలిని పరీక్షించి మందువైచి కట్టించినారు. అంగుళీచ్ఛేదమిపుడు దుస్సహముగానే యున్నది.

ఇచటినుండి తే 19—4—56 దీని హరిద్వారమునకుఁ బ్రయాణము చేయుచున్నాను. అచ్చటినుండి తే 22—5—56 నుండి ప్రారం

భము కాఁబోవు గౌతమీ పవిత్రపుష్కరమునకు రాజమహేంద్రవరము రానున్నాను. అచట 2,3 దినములుండి పలాసా చేరుకొందును. సర్వేశ్వరునిపై భారముంచి యెంతటి దుష్కర కార్యము చేయఁబూనినను— అది ప్రారంభములోఁగొన్ని యిబ్బంది లెదుర్కొన్నను. చివఱకు సఫలీకృతమగును. ఈఆత్మ విశ్వాసముతోనే పురోగమించి మొదలిడిన యీమంత్రానుష్ఠానము నాలోనొక క్రొత్తమార్పును దెచ్చుటయేగాక-ఆత్మవికాసమున కెంతే నుపకారియైనది. మంత్రమేదియైనది సహజప్రభావయుక్తమైయుండును. అది ఫలితమునకు రావలెనన్న మానసికవిశ్వాస మవసరము. అది యేమాత్ర మసంతృప్తికరముగాను న్నను సత్ఫలితమునందుట. భ్రాంతియే. పరిపూర్ణ విశ్వాసము కలుగుటకే జపములు తపములు సత్సాంగత్యదాన హోమ నిష్ఠాదికము లవసరమగును. నిత్యసాధనానుభవము పొందిన నావలెనే ఆత్మీయసోదరులు ఆస్తిక వరిష్ఠులై — బ్రహ్మానందమనుభవింపప్రయత్నింతురు గాక !!

# సప్త భూమికల వివరణము

వేదాంతమును దెలిసి సత్సాధనములననుష్ఠించువారికి సన్మార్గముజూపు సూచనలే భూమికలని పిలువఁదగును. అట్టివి సప్తభూమికలుగావిజ్ఞులచే నిర్ణయింపఁబడినవి.

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోపి నైవకించిత్కరోతి సః॥

గీతజ్ఞానయో 20 శ్లో॥

తాత్పర్యము :- ఎల్లవేళల సంతోషము గలవాఁడు, ఆశ్రయము లేనివాఁడును కర్మఫలమునందాశవీడి కర్మయొనర్చినను చేయనివాఁడే యగును.

శ్లో॥ నహి దేహభృతాం శక్యంత్యక్తుం కర్మాణ్యశేషతః
యస్తుకర్మఫలత్యాగీ సత్యాగీత్యభిదీయతే

గీతమోక్షయోగము 11 శ్లో॥

తాత్పర్యము :- దేహికర్మలను విడచి నిర్వహింపలేఁడు కావున, వేదోక్తకర్మలనాచరించి కర్మఫలమును త్యజియించువాఁడే కర్మత్యాగి యని పిలువఁబడును.

గృహస్థమునందుండుచు త్యాగవ్రతమునుబూని దైవత్వమును పొంది చివఱకు మానవుఁడు భగవత్సాన్నిధ్యమును చేరఁగలఁడు. పరమపదసంప్రాప్తికి త్యాగమే ముఖ్యసాధనము. అందుచేనే యేడుశ్రేణులుగా విభజింపఁబడిన సప్తభూమికలలలో త్యాగవిధానము సంగ్రహముగా వివరింపఁబడినది.

# ప్రథమ భూమిక

తాత్పర్యము :- 1 దొంగతనము 2 వ్యభిచారము 3 అసత్య మాడుట 4 హృదయమున కపటము గలిగియుండుట 5 కొండెములు చెప్పుట 6 బలవత్కారముగా హింసచేయుట 7 తినరానివస్తువులు తినుట 8 శాస్త్రవిరుద్ధములైన నీచకార్యములను చేయుట

విశేషార్థము :- ఇతరులకుఁ దెలియకుండనొకరి ద్రవ్యము తీసి నచోనది దొంగతనముగా లెక్కింపఁబడును. ఇతరులు తమవస్తువులను మఱచినప్పుడు తిరిగి మనమిచ్చివేయవలెను. గాని దొఱికినవిగదా!! యని యుంచుకొనరాదు. అదియు చౌర్యమేయగును.

2. వ్యభిచారమనగా నన్యస్త్రీసంపర్క మొక్కటియేగాదు. స్త్రీలనుజూచి మోహించుట - వారి గుణవర్ణనముచేయుట, వారిమాటలను మమకారముతో వినుట, వారిరూపముల నాలోకించుట, స్పృశించుట యివియన్నియు నాలక్షణములే యగును.

3. అబద్ధమాడుట యనఁగా నొకరిచెంతనుండి యొకవస్తువును దెచ్చి, వారడిగినప్పుడీయక లేదా మేమసలే తేలేదనుట యబద్ధమాడి నట్లగును. ఉన్నది యున్నట్లుచెప్పక వక్రమార్గములో చెప్పుట - ఉండి లేదనుట - యుక్తిగాఁజెప్పుటయునసత్యదోషమేయగును.

4. లోపలనొక ద్వేషముంచికొని పైకి కమ్మగా మాట్లాడుట వటునయగును. పైకినుపకారముచేయుదుననుచు ప్రత్యపకారము చేయుటకూడ ద్రోహబుద్ధియగును.

5. కొండెములుచెప్పుట ; ఉన్నదిలేనట్లు లేనిదున్నట్లుచెప్పుట మొదలగు గుణములు.

6. బలాత్కారముగా హింసించుట. కోడి గొఱ్ఱె బఱ్ఱె మొదలైన మూగజంతువులను నిర్దయగాఁ జంపుట. మనసులేనివారిని తమ స్వాధీనములోనికిఁదెచ్చుటకుఁ బ్రయత్నించుట. ధనమును చూపి తమ కార్యములు చక్కఁబెట్టుకొనఁజూచుట.

7. తినరానివస్తువులు తినుట. మత్స్యమాంసమద్యములు మొదలైన నిషిద్ధపదార్థములను సేవించుట, పొగ(త్రాగుట, పొడుము పీల్చుట పులిసిన పదార్థములనుతినుటగూడ తమోగుణవర్తనములే యగును.

8. శాస్త్రవిరుద్ధములైనపనులుచేయుట, జూదమాడుట, అనవసరప్రస్తావనచేయుట, శాస్త్రవిషయము లెఱుఁగకయే యితరులను పరిహాసించుట. సంకల్పించుట మొదలైనవన్నియు పాపములే. ఇవి యన్నియు నధమశ్రేణికిఁ జెందినవగుటచే వీనిని పరిత్యజింపవలెను.

# ద్వితీయ భూమిక

1 భార్య 2 పుత్రుడు 3 ధనము 4 ప్రియవస్తువులు మొదలైన వారియందు అధికార — అభిమానములు గలిగియుండును, యజ్ఞయాగ జపతపోదికములొనర్చిన ఫలమును త్యాగము చేయవలెను.

విశేషార్థము :— సంసారి భార్యాపుత్రులు, ధన ధాన్యములే ప్రియతమమైనవని తలఁచి సర్వాత్ముఁడగు జగత్ప్రభువును మఱచిపోవు చున్నాఁడు. చివఱిదశలో లోకమున తన జీవితము శోకమయమని ప్రతివాఁడును తెలిసికొనును. కర్మపరంపరచే లభించిన ధనికత్వము ఉన్నత పదవులన్నియు తన ప్రతిభాలబ్ధములనుకొనుట పొరపాటు. యజ్ఞయాగాదికములు మొదలైన పనులనేదో కోరికతో చేయుదురు.

అట్టికోరిక గలిగియున్నచో పునర్జన్మ తప్పదు. బ్రహ్మానందమందగోరు వారీ కామప్రవాహములో స్నానమాడుటకు తలకొనరాదు. సాధన యెంత చిన్నదైనను సాధకుఁడు మాత్రము నిష్కామియై యుండుట లాభకారి. బ్రహ్మజ్ఞులమనుకొనువారు సైతము కోరిక విడనాడక వెను కాడుదురు. పైవానియందు విరక్తియు కలుగవలెనన్న నంతరాత్మ విచారణమవసరము. ఈ విమర్శనాదృష్టియే పురోభివృద్ధికిదారితీయును.

# తృతీయ భూమిక

తృష్ణసర్వదా త్యాగము చేయఁదగినది.

1 అభిమానము 2 గొప్పచెప్పుకొనుట 3 అనిత్యవస్తువులు సంపాదింప యత్నించుట (దీనివలన వైరాగ్యమునకు భంగముకల్గును.) కావున నివిత్యాగము చేయవలెను.

విశేషార్థము :- గురుమూలకమగు ఉపదేశము పొందినను - గ్రంథములు పఠించినను, భగవంతుఁడు కావలసినంత ఆస్తిపాస్తులనిచ్చినను తృప్తిచెందక పరధనవస్తువులనపేక్షించుట భావ్యమేనా ? నేను గొప్పకులమందు లేక వంశమందు జన్మించి నాఁడననియు - విద్యారూపవంతుడనను అభిమానముగల్గి యుండుటయు నీపవిత్రసాధకుండ వలసిన గుణములుకావు. ఆత్మస్తుతులు – పరనిందట పాపహేతువులని తెలిసియుండియు మూడురోజులముచ్చటకై లేనిపోని ప్రగల్భము లాడుట జ్ఞానహీనుని పనికాని, జ్ఞానిపనికాదు. అదియునుగాక, అందచందాలగా కనిపించు నీలోకములోని వస్తువులు, వ్యక్తులున్న ట్లుండి, మనకు చెప్పకయే దూరమైపోవును. అంతవఱకెందుకు ? తనకుఁ దెలియకుండగనే తన్ను మృత్యు రాక్షసి కబళించుచున్నది. అతి బల

కరములైన మన ఆశలను నేడుండి రేపు నశించిపోవు వానియం దుంచుట కంటె వానిని నిత్యుడైన పరమేశ్వరునియందుంచుట మంచిది. లోక వస్తువులను ప్రేమించుటచే - అని కొన్నాళ్ళకు మనలను విడనాడిపోయి నపుడు దుఃఖితులము కాగలము. కావున వైరాగ్యభావమునకు విరుద్ధములగు ఐహిక వాసనలకు దూరముగానుండుట శ్రేయస్కరము.

# చతుర్థభూమిక

1 స్వార్థప్రయోజనములకై యితరులచే సేవ చేయించుకొనుట

2 సేవచేయుటకు యాచించుట

3 అయాచితముగా వచ్చినదానిని స్వీకరింపకుండుట

వీనిని త్యాగము చేయవలసియున్నది.

విశేషార్థము :- శాస్త్రసారమేమనగా పరులను పీడించుట పాపమనియు పరులకుపకారము సేయుట పుణ్యమని తెలియుచున్నది. ఈ సంగతి తెలిసియుండియు తాత్కాలికధనపదవీవిద్యాభిమానములచే గర్వించి తానే యెక్కువయని యితరులను చిన్నబుచ్చుట, అధికారము పెత్తనము చేయుటలను విడిచిపెట్టవలెను. స్వార్థమను దుర్గుణమును పెద్దలు చీడపురుగుతో బోల్తురు. అదియున్నచోట ప్రేమ-కారుణ్యములను లతలు పెంపొందక పుష్పింపక నశించిపోవును. అందుచే నీదుర్గుణమునకు మనస్సున స్థానమొసంగకుండుట మేలు.

సత్యమునకు బాగుగానాలోచించినచో యజమాని సేవకులు తోడిసోదరులు ఆసంగతి మఱచి సేవకుని నీచముగా జూచుచు, హింసించుట తగదు. భగవంతుడొక్కడే సర్వాధికారి. ఆతని శాసనములకు మిగిలినవారందఱు భృత్యులే. ఈమహత్తరవిషయమును గ్రహింపక మిడిసిపడువారు అజ్ఞానులే.

పొట్టపోషించుకొనుట స్వతంత్రముగానే జరుగవలెనని మనపూర్వుల సంకల్పము. అట్టిది పరులసేవ యొనరించునపుడనేక దోషములు సంక్రమించును. సేవకావృత్తి పాపమూలమగుటచే దానిని పరిహరింపుమన్నారు విజ్ఞులు.

పూర్వకర్మానుసారముగానన్నియు లభించుచుండును. దానికి వ్యతిరేకముగా నొక్క గవ్వయైననురాదు. ఈరహస్యమును దెలిసిన బుద్ధివంతులు లేనిపోని కోరికలతో శాంతిని పాడుచేసికొనరు. అరణ్యమధ్యమునందున్నను పూర్వపుణ్యఫలితముగా రావలసినది వచ్చితీరును. అట్లే కష్టసుఖములనుభవింపవలసియుండును. కావున కోరకుండగవచ్చు దానిని అమృతమట్లు స్వీకరింపవలెనేకాని తిరస్కరింప రాదు.

# పంచమభూమిక

1 సంపూర్ణకర్తవ్యకర్మలయందాలస్యముచేయుట; ఉపేక్షించుట.

2 ఇతరులు తన్ను బాధించుచో సహింపక తిరుగుబాటుచేయుట, నిందించుట.

3 నియమములు విడచి స్వేచ్ఛగా ప్రవర్తించుట.

4 లౌకికవ్యక్తుల గుణరూపములను — భోగములను వర్ణించుట — చింతించుట.

5 ఆత్మవిశ్వాసమును గోల్పోయి అధైర్యము వహించుట.

6 పేరు ప్రతిష్ఠలకోసము మనస్సులో లేకపోయినను నటించుట.

7 దివ్యచైతన్యమగు సర్వాంతర్యామిని మఱచి భేదద్వేషములు వహించుట-వీనిని పరిత్యజింపవలెను.

విశేషార్థము :— గృహస్థుగానున్నవాడు తప్పక కర్మయోగమును జక్కగ నాచరించినగాని, యాతని ఉద్యమము విజయవంతము

కాదు. భగవత్పూజ, సాధుపూజ, భూతదయ, అనాథరక్షణము, అతిథి, అభాగ్యతసమాదరణము, మున్నగునవియన్నియు తనకు విహితకర్తవ్యములై యుండగా వానిని త్రోసిపుచ్చి, స్వార్థుఁడై జీవించుట పాపము. పైకర్మముల నాలస్యముగా ప్రారంభించుట — చేయుటలో ఉపేక్ష చూపించుటలో మంచిదికాదు.

తన్నితరులు బాధించుచున్నారని పామరులనుకొందరు. కాని నిజమునకాలోచించిన వారు పూర్వపాపకర్మానుసారముగా బాధించుచున్నారు. యథార్థమునకు తన్ను బాధించునది పూర్వకర్మ. ఈరహస్యమెఱింగినవారొరులపై తిరుగుబాటు చేయుటగాని నిందించుటగాని చేయఁబూనరు.

శాస్త్రాలందు నిర్ణయించిన నియమములను పాటింపక కేవల భోగలాలసుఁడుకారాదు. అట్లొనరించిన శాస్త్రధర్మములను, ధర్మజ్ఞులను తిరస్కరించినట్లెయగును.

అనిత్యములును — మోహానదీపకములునగు అన్య స్త్రీధనవస్తువులను మోహించుటయు; కావలెననుటయు, వానిగుణరూపలను సారెసారెకు తలంచుటకూడ పాపమే. అట్టితలంపులు మనస్సున కాపురముండనట్లు చేయవలెను.

సత్యము, శాంతి, ధర్మము, భూతదయ మొదలైన సద్గుణములందు దైవమున్నాడని తెలిసి యాత్మవిశ్వాసముతో వానినాచరించుట, ఈ విశ్వాసములేనిచో సాధకులు సచ్ఛీలమును భద్రముగా కాపాడుకోలేరు. సామాన్యముగా లోకములో కష్టసుఖములు పర్యాయముగా వచ్చుచుఁ బోవుచుండును. అవి కర్మబంధానుబంధములు. అంతమాత్రమున చలించి ధైర్యము విడనాడరాదు.

ఇతరులు వచ్చి మాకీయుపకారము చేయుఁడని కోరినపుడు, గొప్పకై వారినితరులకంటగట్టుట దూష్యము. తనకు భగవంతుఁ డిచ్చినదానితో వారిని సంతృప్తిపఱచవలెనుగాని నటింపరాదు.

ఇతరులకు లేఖలను వ్రాయునపుడుగాని మాట్లాడునపుడు కఠిన ములగు వాక్కులను ప్రయోగించి; వారిమనస్సులను బాధింపరాదు.

లోకమునందలి యన్ని జీవజాలములాభగవంతుని సంతానములే. కాని జాతి మత ప్రాంత దేశభేదములను లెక్కించి, యితరులను చిన్న పుచ్చుట నింద్యము. జాతి మత కుల భేదములను పాటింపక సర్వసామ రస్యమును ప్రకటించుట-తోడ్పడుటలు మానవలక్షణములు.

పంచ యజ్ఞములను ప్రతిఫలరహితముగా చేయుట. అవి 1 దేవ యజ్ఞము 2 ఋషియజ్ఞము 3 పితృయజ్ఞము 4 మనుష్యయజ్ఞము.

1. దేవయజ్ఞము :— దేవతలనుద్దేశించి; జపతపహోమాదికము లొనర్చి వారిని తృప్తిపఱచి - యిష్టార్థములందుట.

2. ఋషియజ్ఞము :— లోకకల్యాణముకొఱకు తపస్సొనర్చి - బహుశ్రుతిస్మృతీతిహాసాలనందఁజేసిన మునీంద్రుల ఋణమును దీర్పఁ జేయు యాజ్ఞికవిధానము.

3. పితృయజ్ఞము :— తనజన్మకు సంబంధించిన తండ్రి తల్లి తాత ముత్తాతలు మొదలైన వంశీయుల మనస్తృప్తికిఁజేయు నిష్ఠా క్రమము.

4. మనుష్యయజ్ఞము :— కుటుంబము లేక ప్రజాలోకమునకు చేయు సేవ.

5. భూతయజ్ఞము :— నోరులేని పశుపక్ష్యాదులకు బలిదానము మొదలైనవానినిడి తృప్తిపఱచుట.

ఇవియన్నియు కామ్యరహితముగా (కోరికలేకుండ) చేయవలసి యున్నది.

ధనము - శక్తి - విద్యాయోగ్యతలున్నపుడు వానిని దుర్వినియోగము చేయక ; వానిని నిస్పృహులు, ఆర్తులైనవారికి వలసిన సహాయము చేయవలెను. సాధ్యమైనంతవఱకువర్ణాశ్రమధర్మములను పాటింపవలెను. స్వధర్మముకన్న పరధర్మము భయావహమైనది. స్వధర్మాచరణమునందు కష్టనిష్ఠురములను పరిగణింపరాదు.

మానవజీవితము కర్మబద్ధముకావున, కర్మలనాచరించి కర్మపాశమును, తొలగించుకోవలెను. శరీరాభిమానమును త్యజించి, భోగములందపేక్షచూపక స్వల్పతృప్తికల్గియుండుట శ్రేయము.

# షష్ఠ భూమిక

1. నిత్యానిత్యవివేకము లేక చరించుట.
2. ప్రాపంచికవిషయములందు మనస్సుంచుట.
3. లక్ష్యమునువీడి స్వేచ్ఛగా మెలగుట.

వీనిని త్యాగము చేయవలెను.

విశేషార్థము :— లోకమంతయు ననిత్యమనియు, పరబ్రహ్మమే నిత్యమని తెలిసికొని లోకవిషయములందెక్కువ మక్కువ చూపక - పరలోకమునకువలయు సాధనసామగ్రిని జతపఱచుకొనవలసియున్నది. ఈదృశ్యమానజగత్తే నిత్యమనువారికి పాపపుణ్యములతో నిమిత్తముండదు. నిత్యానిత్య వివేకమలవడుటకు పెద్దలసేవ చేయుటయే సాధనము.

ప్రాపంచిక విషయములందు మమకారముగలవాడోకనాటికైన దుఃఖితుడగును. లోకమునసీనాడు ధనవంతుడుగనున్నవాడెల్లకాల

మల్లేయుండునా? ధనికుడు పేదయగును; పేదయే ధనాఢ్యుఁడగును. లోకపు ప్రకృతి పరిణామశీలకదా!!

ప్రాపంచిక విషయములయందలి మమకారము కడకు వృద్ధి పొంది, జన్మాంతమున నదేభావముతోఁజనిపోవును. అంతటితో సరిపోదు. ఆభావమునకు తగిన జన్మను తిరిగి యెత్తవలసియుండును. దీనికుదాహరణముగా జడభరతునికథ కాన్పించుచున్నది. జడభరతుఁడొకరాజు. చాలకాలమాతఁడు రాజ్యమేలి చివఱకు వానప్రస్థుఁడై యరణ్యమున తపస్సుచేసికొనుచుండెను. అతనికి ధ్యాననిష్ఠ చక్కఁగా సాగుచుండెను. ఒకనాడతడు చెఱువులో స్నానము చేయుచుండగా చూలాలగు నొకలేడి పులియఱపునకు భయపడి ఆజలమందే యొకశిశువును ప్రసవించి చనిపోయెను. జలమునఁబడి చనిపోవనున్న లేడిపిల్లను దీసి సర్వసంగపరిత్యాగియైనను-అతఁడు పెంచుచుండెను. ఇపుడాతని దృష్టి-మమకారమంతయు లేడిపైపునకు మఱలెను.

కొన్నాళ్ళకాలేడిపిల్ల యెచటికో పోయెను. ఆమునిరాజు వెదకినను ప్రయోజనములేక పోయినది. ఇంతలోనాతనికి ప్రాణప్రయాణముకాలము వచ్చినది. లేడిలేడీయని పలవించుచు నాతడు ప్రాణములు విడచెను. అందుచే నాతని రెండవజన్మ లేడి. ఇట్లే ఆతఁడు మఱికొన్ని జన్మలను పొంది చివఱకు మనుష్యజన్మమున భగవత్ప్రాప్తిని తగు నవకాశము కల్గినట్లు భాగవతము బోధించుచున్నది.

భగవంతుని రూపమును మనస్సునందుంచుకొని, భగవన్నామమును స్మరించుచు ఏకాంతమునగాని నల్గురితోగాని సద్గోష్ఠి జరుపవచ్చును. ఎప్పటికప్పుడు మోసగింపనున్న మాయా దేవతబారినుండి రక్షింపఁబడవలెనన్న భగవన్నామానుసంధానమే ప్రధానసాధనము.

# సప్తమ భూమిక

1 లోకవాసనలు కల్గియుండుట

2 మానవ ధర్మములను మఱచుట

3 ఇతరులను మోసగించుట

వీనిని త్యాగముసేయవలెను.

విశేషార్థము :- సంసారమునందు, శరీరమునందు, కర్మలయందు గల సూక్ష్మవాసనలను త్యాగము చేయవలెను. ఈసంసార మాయా చిత్రములను మనస్సునందు సుదీర్ఘముగా విచారించి సత్యాసత్యములను తెలసికోవలెను. మనుష్యజన్మ అశాశ్వతమైనదని తెలిసికొన్నచో అహంకారము కొంతతగ్గును. తృష్ణ, మమత ఇత్యాదికములు పరిత్యాజ్యములు.

అహింస, సత్యము, ఆస్తిక్యము, బ్రహ్మచర్యము,అపైశునత్వము లజ్జ, అమానిత్వము, నిష్కపటతలను సాధకులలవఱచుకోవలెను.

అహింస :- మనోవాక్కాయ కర్మలచే ఇతరులకు బాధకల్గింపకుండుట.

సత్యము :- ఎట్టిక్లిష్టపరిస్థితి యందైనను అబద్ధమాడకుండుట.

ఆస్తిక్యము :- దేవుడున్నాడను భావము కల్గియుండుట.

బ్రహ్మచర్యము :— వీర్యమును భోగసుఖములందుపయోగింపక ధ్యానమననాదులకుపయోగించుట. ఈ నిష్ఠగలవాడు బ్రహ్మవర్చస్సుతోనుండి - పరబ్రహ్మము గాంచగలడు.

అపైశునత్వము :- ఎట్టిబాధపడుచున్నను - రోషావేశము నొందకుండుట.

లజ్జ :- తన్ను పొగడునప్పుడు, పూజించునప్పుడు సిగ్గుపడుట గొప్ప తనమంతయు తనది గాదనియు - అదిభగవంతునిదేయని నిగర్విగా నుండుట ఉత్తమలక్షణము.

నిష్కపటత :- ఉన్నదియున్నట్లుగా మాట్లాడుట. లోపల నొకటి పైనొకటి మాట్లాడుట. పాపము

శౌచము, సంతోషము, తితీక్ష, సత్సాంగత్యము, సేవ, యజ్ఞము దానము, తపస్సు, స్వాధ్యాయము, శమము, దమము, వినయాదికము లను సాధకులు క్రమముగా నలవఱచు కోవలెను.

## బహిరంతశ్శుద్ధులు

బహిరంగశుద్ధి :- శరీరము మురికి పట్టినపుడు సబ్బు మొదలైన వానితో తోమి శుభ్రపఱచుట ఇంతమాత్రముచేత లోపలనున్న కామ క్రోధలోభమదమాత్సర్యములను దుర్గణములు తొలగిపోవు. ఈదుర్గణ ములు తొలగిపోవలెనన్న పైని సప్తభూమికలలో చెప్పబడిన సద్గుణ సంపత్తినలవఱచుకోవలెను. పెద్దకబురులు చెప్పి క్రియాశూ న్యులైన వారితో అంతశ్శుద్ధి కాన్పించదు.

శౌచము :- బహిరంతశ్శుద్ధులు కలిగియుండుట.

సంతోషము:-పేరాస లేక సర్వము పరమేశ్వరునియందుంచుటచే నేర్పడు ఆనందభావము.

తితీక్ష :- ద్వంద్వములయెడ సహనభావము కలిగియుండుట.

సత్సాంగత్యము :- లోకాభిరామాయణ విముఖులగు జ్ఞానులతో కలసి యుండుట.

స్వాధ్యాయము :- వేదశాస్త్రేతిహాసములను పఠించుట, ప్రణవాది పరమపవిత్ర మంత్రమునుచ్చరించుట

శమము :- అంతఃకరణవృత్తిని వశమునందుంచుకొనుట

దమము :- తాను చెప్పిన ప్రకారమింద్రియములను నడిపించుట

ఇట్లు కొన్ని విశేషధర్మములను శాస్త్రములు చెప్పుచున్నవి. అవియేవనగా 1 ఆర్జవము 2 దయ 3 శ్రద్ధ 4 వివేకము 5 వైరాగ్యము 6 అపరిగ్రహము 7 సమాధానము 8 ఉపరామత

1 ఆర్జవము :— అంతరంగికముగా నింద్రియాదుల క్రియాకలాపములయందు ఋజువర్తన కల్గియుండుట.

2 దయ :— సర్వభూతములయందు దయ చూపించవలెను. ముఖ్యముగా వికలాంగులు, వస్త్రవిహీనులు, ఆర్తులయందు ప్రత్యేక శ్రద్ధ చూపించవలెను.

3 శ్రద్ధ :— వేదాదులయందుఁ జెప్పఁబడిన పరమార్థము విషయములను తెలిసికొనుటయే గాక, తన యాచరణమందుఁ బెట్టుటలో చూపించునాసక్తి.

4 వివేకము :— ఏది నిత్యమైనవస్తువో, అనిత్యవస్తువేదో తెలిసికొనుట.

5 వైరాగ్యము :— సాంసారిక విషయములందు విరక్తిచూపుట.

6 అపరిగ్రహము :— ఒకరివస్తువులు పుచ్చుకొనుటవలన ఋణపడవలసి వచ్చును. కావున నితరులవస్తువులను తీసికొనకుండుట.

7 సమాధానము :— విషయములయెడ సందేహములేక నిశ్చితమైన భావమేర్పడుట.

8 ఉపరామత :— తనమనోబుద్ధులు రెంటిని లోక పరిజ్ఞానము నందుంచక, వానిని నిత్యుండైన భగవంతునియందు లగ్నముచేసి ఆనందించుట.

# కొన్ని శాస్త్రోక్త సద్గుణములు

1 క్షమ 2 ధైర్యము 3 అద్రోహము 4 అభయము 5 నిరహంకారము.

1 క్షమ :— తనకెంత జరుగుబాటున్నను, శక్తి సామర్థ్యాలున్నను, ఇతరులు బాధించినపుడు సహించి యూరకొనుట. అట్లూరకొనుట అసమర్థత యనుకొనరాదు. ఉత్తమ రూపము కావలెనను వారీ క్షమాగుణమును దాల్చుదురు.

2 ధైర్యము :— కర్మబంధమువలన వచ్చు చలనము, నాశనము, పరిభ్రమణము, మరణములు మొదలైనవి సహజములేయని భగవంతునియందు భారముంచి. ధైర్యముగా సంతోషగానుండుట.

3 అద్రోహము :— శత్రువపకారము చేయుచున్నపుడును ద్వేషింపక వారికి ద్రోహము తలపెట్టకుండుట.

4 అభయము :— గతిలేనివారు - కర్మవశమున పతితులైన వారియెడ క్రోధభావము వహింపక - ప్రేమతో నాదరించుట.

5 నిరహంకారము :— తలంపున - మాటలలో - పనులొనరించినపుడు తన్నుదాను పొగడుకొనరాదు పరదూషణ, ఆత్మస్తుతులు పాపము కదా!!.

పై సద్గుణములు తృతీయ భూమికలో పరిపక్వమైనపురుషుని లక్షణములుగా గ్రహింపవచ్చును. అటులనే యొకానొక సమయమున సాధకులు వెనుకనుండి ముందునకు వచ్చుటయుకలదు. సంపూర్ణగుణావిర్భావము మూడవ భూమికలోఁ గల్గును. ఇవన్నియును భగవత్కృపా

పమునకుఁ బోవువారి సర్వోత్తమలక్షణములు. మానవులకీ యోగ్య గుణములందధికారమున్నది.

ప్రతిమానవుఁడును జన్మరహస్యము కర్మయయని తెలిసికొని, ఆ కర్మను నిర్మూలించుటకు సత్కర్మలనాచరించుచు, కర్మను తగ్గించు కొనుచు మాయా సంసారమునుండి తన్ను ఉద్ధరింపుమని పరమేశ్వరుని ఆర్తితో ప్రార్థించుచుండవలెను.

సృష్టిలోని ప్రతిజీవికిని మూలకేంద్రము తల్లియే. అట్లే ప్రపంచములోని అన్ని మతములు చివరకు అద్వైతమతముతోనే సమన్వయమగును. అట్టి పవిత్రమతము భారతీయులదై యుండుట మనకు గర్వకారణము. కడకు సగుణారాధకులకు సైతము గమ్యమీ అద్వైతము స్వప్రయోజనమే పరమార్థమని తలచుకొండఱ వలననీమతమునకు నానాట చెఱుపుగల్గుచున్నను ముక్తియొక కారణజన్ములు నిష్కళంకమగు శీలముతో నీమతప్రచారమును ప్రారంభించి సాగించుచు సనాతన ధర్మదేవతయగు పరమాత్మ సత్యధర్మములయందధికాభిమానము చూపుచునే యున్నారు.

# ఉపసంహారము

ఈచిన్నపుస్తకమున భగవత్ప్రాప్తికినువగు సప్తశ్రేణులను గూర్చి చెప్పబడినది.

స్వప్నమునకాన్పించిన పొందినవెల్ల జాగ్రదవస్థలో నెట్లసత్యమో అట్లే జ్ఞానికీ దృశ్యమానజగత్తంతయు స్వప్నజగత్తువలెనే తోచును. కర్మలవలననే జీవుఁడు తిరిగి జన్మించును. యోగమనగా కర్మలనాచరించుటలో చూపునైపుణ్యమే. కావున యోగసిద్ధిని సంపాదింపగోరు

క్షణక్షణము ప్రమాదకరమగు లోకమున జీవించి ధర్మమును నిలువ
బెట్టుకొనుటకూడ దుష్కరమే.

ఆదర్శపురుషులు — ముక్తసంగులు — మహాత్ములు స్వసుఖ
లాభములను చూచుకొనక, పరోపకారలక్ష్యముతో — భగవత్సేవా
దీక్షతోనుందురు. వారందఱవలె మర్త్యులేయైనను వారొనరించు పవిత్ర
కార్యములు వారికొక శాశ్వతమైన అమరరూపనామములను ప్రసాదిం
చును. వారివాక్కులే శాస్త్రరూపములనుదాల్చును. దాల్చియున్నవి.
వారి ఉపదేశపరంపరలే జగత్తునకు కల్యాణసూత్రములగును.

అట్టివారికి మట్టి, రాయి, ఇల్లు, ధనము, బంగారము మొద
లైన వస్తువులయందేమి — వ్యక్తులయందేమి సమాన భావమే
యుండునుగాని ; వ్యామోహముండదు. ఒకవస్తువు దొఱకినపుడు
సంతోషమును — పోయినపుడు విచారమును కలుగవు. వారు
మానావమానములకు ; శీతోష్ణవములకు, సుఖదుఃఖములకు అతీతులు.

ఎడారిలో లేడిదూరముగా కనిపించునిసుకతిన్నెలను నీటిమడు
గులని తలచి ; దాహముతీర్చుకొనుటకై పరువెత్తి — నిరాశపడును.
అటులనే సంసారి యీసంసారమునందేదోపరమార్థమున్నదని ప్రవే
శించి చివఱకు హతాశుడగుచున్నాడు. ఈకీలక మెఱిగిన బుద్ధివంతులీ
లోకవ్యవహారములందు తామరాకుపై నీటిబొట్లవలె మెలగుదురు.

ప్రగాఢతపస్సున గుఱకలుపెట్టి నిద్రపోవు నాప్రియసోదరీ
సోదరులారా !! ఏల ప్రమత్తులై యుందురు ? ఏమాత్రము కనికారము
చూపక మ్రింగుటకుసిద్ధముగానున్నది మృత్యురాక్షసి !! ఈలోకమొక
నాటకరంగమని యింతవఱకు గుర్తింపకపోవుట శోచనీయము !!

ఈనాడుండి రేపునశించిపోవు శారీరకవాంఛలను త్యాగము
చేసి — సచ్చిదానంద పరబ్రహ్మమునందు మనోబుద్ధులుంచి — దాని

షలనకల్గు శక్తిస్థైర్యములతో ఆధ్యాత్మికవిజయమును సాధించి — చరితార్థులగుటకు సద్గురుల సదుపదేశామృతమును గ్రోలగను, సద్గ్రంథములను పఠింపగను, సత్సహవాసముచేయగను — భగవద్భజనములో పాల్గొనుటకుచింకను జాప్యముచేసెదరేల!! అదే!! ముక్తకంఠముతో పరమేశ్వరుండు మిమ్ములను దీవించుచున్నాడు. మీరిక శ్రద్ధావినయభక్తిప్రపత్తులతో ముందుకురండి; ఆ దివ్యాశీస్సులను శిరసావహించి ధన్యులయ్యెదరుగాక!!

సనాతనధర్మదేవతకు జయమగుగాక!!

# జీవన్ముక్తికి అంత్యోపదేశ రత్నములు.

ఒక్కొక్క విషయమునం దొక్కొక్క ప్రసిద్ధుకుడు ముక్తి నొందిన విషయములు సంఘటించి యీదిగువ నుదాహరించితిమి.

1 నిన్ను నీవెఱుంగుము. (వ్యాసమహర్షి)

2 నీమనోవృత్తిని జయించుము. (భృగుమహర్షి)

3 సర్వదా నీవాగ్దోషములను, కనిపెట్టుచుండుము. (కణ్వఋషి)

4 సమస్త చరాచరజీవరాశుల నీశ్వరవిలాసముగా దలంచుము. (శ్రీశుకుడు)

5 సుఖదుఃఖములు మనస్సునకేగాని తనకుగాదని గ్రహింపుము. (మండూకఋషి)

6 దృష్టిని సదా యీశ్వరునియందు నిలుపుము. (తైత్తిరేయులు)

7 నశ్వరమగు నీశరీరమును నమ్మవలదు. (జైమిని)

8 ఈసృష్టి యంతయు మాయావిలాసమేయని తలంపుము. (వసిష్ఠమహర్షి)

9 సమాధిలో గోచరించు దశవిధనాదములకు భ్రమింపకుము. (దాల్భ్యుడు)

10 స్వరూపస్థితియందు నిలుకడజెంది నిశ్చలముగా నుండుము. (కపిలుడు)

11 సమాధిలో నున్నప్పుడు గోచరించు వివిధములైన వెలుగులకు భ్రమింపకుము. (మనువు)

12 గోచరించు చిత్రవిచిత్ర దృశ్యములకు, భ్రమింపకుము. (అంబరీషుడు)

13 నిత్యతృప్తియే, పరమైశ్వర్యమని తలంచుము. (ఉద్దాలక మహర్షి)

14 అహంకారమునే యన్నియనర్థములకుమూల కందముగా నెంచుము. (వ్యాస్మహర్షి)

15 కామక్రోధములే నరకద్వారములని విశ్వ సింపుము. (శాకటాయన ఋషి)

16 అంతఃకరణశుద్ధికి నిష్కామకర్మ యోగ మును సాధనముగా, నాచరింపుము. (గాలవముని)

17 మనశ్శాంతిని మనశ్శుద్ధిని పొందుటయే మానసిక తపస్సని భావింపుము. (జమదగ్ని)

18 మలము విడుచువరకెంత తొందరపడుదు మోయంత తొందర దుర్విషయములయం దుంచుము. (కణ్వఋషి)

19 పరమానందమే నీ లక్ష్యముగా నుంచు కొనుము. (ఆత్రేయుడు)

20 జ్ఞానాగ్ని ప్రజ్వలించువరకును తపమాచ రింపుము. (ప్రహ్లాదుడు)

21 విషయాసక్తియే బంధహేతువని యెఱుంగుము. (దేవహూతి)

22 సర్వభూతములను సమదృష్టితో చూడుము. (యాజ్ఞవల్క్యుడు)

23 ధ్యానకాలమందు త్రిగుణములకు లోబడ వలదు (జడభరతుడు)

24 తనపుణ్యకర్మములే తన్నురక్షించునని సర్వ కాలములందు నమ్ముము. (విశ్వామిత్రుడు)

25 సర్వభూతములను ఆత్మరూపముగా జూడుము. (వరుణుడు)

26 సర్వదా సద్విషయములనే విచారించు చుండుము. (బృహస్పతి)

27 అష్టసిద్ధులందు వ్యామోహ మొందకుము. (అజగరుడు)

28 సర్వకాలములందు సనాతనధర్మములనే ఆచరింపుము. (రుక్మాంగదుడు)

29 ఎట్టి దుష్టకార్యములకు వశపడకుము. (అక్రూరుడు)

30 మానవసేవయే మాధవసేవయని తలంచుము. (శిబిచక్రవర్తి)

31 నీదోషములను పరులకు వెంటనే వెల్లడించుట శ్రేయోదాయకము (శారదాదేవి)

32 ఏకాంతముగకూడ పాపకార్యములను తలంపకుము. (గార్గేయి)

33 దృశ్యము లక్ష్యమని నిశ్చయింపుము. (మైత్రేయి)

34 జిహ్వాచాపల్యమును జయింపుము. (ధ్రువుడు)

35 గుహ్యచాపల్యమును జయింపుము. (ఆంజనేయుడు)

36 బ్రహ్మచర్యమును నిరాటంకముగ కాపాడుము. (భీష్ముడు)

37 సర్వకష్టములకోర్చుకొనుము. (విభీషణుడు)

38 నీయింద్రియదోషములను నీవెఱుంగుము. (లక్ష్మణుడు)

39 నీమనోదోషములను కనిపెట్టుచుండుము. (హిరణ్యకశిపుడు)

40 సర్వేంద్రియములను విషయములనుండి మరల్చుము. (దిలీపుడు)

41 ఇతరులయందున్న మంచిగుణములనుమాత్రమే గ్రహించుము. (అర్జునుడు)

42 ఎన్నటికిని గర్వమునొందకుము. (భీముడు)

43 కష్టము కలిగినప్పుడు నీకంటె కష్టపడువారిని
జూచి సమాధానము నొందుము. (నలమహారాజు)

44 గర్వముగలిగినపుడు నీకంటె యధికులను జూచి
గర్వమును విడువుము. (కీచకుడు)

45 ఎంత తెలిసియున్నను, గురువునాశ్రయించుము. (ఏకలవ్యుడు)

46 సర్వదా నీకర్తవ్యము మఱువకుము. (జనకమహారాజు)

47 ఆత్మాశనే పరమదారిద్ర్యమని భావించుము. (కుచేలుడు)

48 సత్యవస్తువునే యాశ్రయించుము. (హరిశ్చంద్రుడు)

49 స్వార్థమే పాపహేతువని యెఱుంగుము. (సులభ)

50 ధర్మమునే యాచరించుము. (విదురుడు)

51 సత్యమునే వచించుము. (ధర్మరాజు)

52 పంచభూతాత్మకమైన శరీరమును జూచి
వ్యామోహము నొందకుము. (సంవర్తకుడు)

53 ఏకాకివై ప్రశాంతముగ బ్రహ్మచింతన
చేయుము. (శాంతానందుడు)

54 నీ దీక్షను సర్వదా పాలించుము. (శ్రీశంకరాచార్యులు)

55 క్షణకాలమైన దుర్విషయములకు విని
యోగింపకుము. (అరవింద ఘోషు)

56 మరణకాలమందైనను, మంచి లక్ష్యమును
విడువకుము. (వివేకానందస్వామి)

57 మోక్షసౌధమెక్కుటకు సజ్జనసాంగత్యమే
ప్రథమ సోపానమని తలంపుము. (రామతీర్థులు)

58 ఇదివరలో చూచిన సత్పురుషులను, మఱల
మఱల నీదృష్టిలో నుంచుకొనుము. (స్వామి రామకృష్ణ)

59 మలము చిడచినపిమ్మట మఱలధ్యానించుట కెంత యసహ్యపడుదువో నీ దుర్గుణముల యందంత యసహ్యతనుంచుము. (గురు నానక్)

60 దేశసేవయే దేవుని సేవయని సదా ఆచరింపుము. (పొట్టి శ్రీరాములు)

61 మహాత్ములచే నాచరింపబడినదే ధర్మమని తలంపుము. (పరాశరుడు)

62 మార్పుజెందునదే యసత్యము - మిధ్యయని భావింపుము. (జమదగ్ని)

63 శమాదులు సదాచారము పరస్పరము శోభించునని తలంపుము. (భార్గవఋషి)

64 అహంకారత్యాగమే నిజమైన త్యాగమని భావింపుము. (భారద్వాజుడు)

65 త్రికాలబాధ్యమైనదేసత్యమనివిశ్వసింపుము. (జాబాలి)

66 ఆత్మ సర్వహృదయ గుహాంతర్గతు డని నమ్ముము. (మాంజాయన మహర్షి)

67 ఆసురిగుణములను పూర్తిగా విడువుము. (సనత్సుజాతుడు)

68 భగవంతుని స్మరించు నేత్రములే నిజమైన నేత్రములని యెఱుంగుము. (దధీచి)

69 ఈ సర్వప్రపంచమును ఆత్మకంటె భిన్నముగా చూడుము. (గౌతమ మహర్షి)

70 ధ్యానకాలమున ఓంకారమును శాంతముగా నుచ్చరింపుము. (పులస్త్యుడు)

71 సర్వసిద్ధులకు జ్ఞానమే మూలకందముగా భావింపుము. (గాలవుడు)

72 దైవీగుణములనే యలవరచుకొనుము. (ఉమాదేవి)

73 భగవదర్పితశరీరమే సార్థకమని తలంపుము. (పరశురాముడు)

74 చలనము, వికారముగలిగినపుడు మౌనమును వహింపుము. (సుమతి)

75 వివేకముచే యదార్థ ముముక్షుత్వము కలుగ గలదని యెంచుము. (ఆంజనేయుడు)

76 భగవన్నామము నుచ్చరించు మృదుభాషిణి యగు వాక్కే సత్యవాక్కని భావింపుము. (కార్తికేయుడు)

77 సత్యవస్తువునాశ్రయించిసత్యత్వమునొందుము. (మాంధాత)

78 సత్యక్రియతమగు వాక్కే వాచక తపస్సని భావింపుము. (పూహూరచక్రవర్తి)

79 సుఖస్వరూపవస్తువు నాశ్రయించి సుఖము నందుము. (అజమహారాజు)

80 మనోమలత్యాగమే యథార్థస్నానమని యా చరింపుము. (ధృతరాష్ట్రుడు)

81 మనశ్శాంతినందించుసత్కర్మనేయెల్లపుడాచ రించుము. (సహదేవుడు)

82 ఈసర్వమును ఆత్మకంటె నభిన్నముగా జూడుము. (స్వామిదయానంద)

83 మలినవాసనలను దూరముచేయుచు పరిశుద్ధ వాసలనే సంపాదింపుము. (వేమనయోగి)

84 కులగోత్రములనుదలంచుకొని గర్వపడకుము. (మర్యాపుడు)

85 ఎవరిగాని సేమాటలుచేతనుగాని చేతలచేతను కష్టపరుపక ధర్మబద్ధుడవై యుండుము. (శాండిల్యమహర్షి)

86 సత్యము దేశమునకుగాని, జాతికిగానికట్టుబడి యుండునదికాదు. (అష్టావక్రమహర్షి)

87 ఇతరులకుకీడుకలిగించుటే అధర్మమనినమ్ముము (సాందీపుడు)

88 ఏకాంతవాసము నభిలషింపుము. (వాలఖిల్యుడు.

89 నీకు మంచిదికానిది యితరులకు జేయకుము. (నచికేతుడు)

90 ఉద్యాంతములయందు భగవంతుడున్నాడని గ్రహింపుము. (నచికేతుడు)

91 జనవాక్యము భగవద్వాక్యమేనని తలంపుము. (పతంజలి)

92 సత్ప్రవర్తనగలవానికే భగవంతుడు ప్రేమించు నని భావింపుము. (సగరుడు)

93 ఎంత కష్టమువచ్చినను పరులకు కీడుచేయ కుండుటే ధర్మమని తలంపుము. (కుంతీదేవి)

94 నీకుకుడిచేతితోనిచ్చినది యెడమచేతికి తెలియ నంతగుప్తముగా దానము చేయుము. (కర్ణుడు)

95 అజ్ఞానమును త్యజించి నిష్కళంకుడవుగమ్ము. (రామదాసు)

96 ఇతరుల కోపికతో సమాదానమిమ్ము. (స్వామికరపాత్రజీ)

97 వివేకముతో స్వార్జితమైన మితాహారమునే భుజింపుము. (గాంధీజీ)

98 సర్వనాశనమగుచున్నను భగవంతునియందు విశ్వాసము వీడకుము (బలిచక్రవర్తి)

99 పరమపద ప్రాప్తికి శరీరము హేతువగుట
మిగుల విచిత్రమయినది. అందుచే, దానిని
జాగ్రత్తగా కాపాడుకొనవలయును. (మహామ్మద్ ప్రవక్త)

100 ధనమును వ్యర్థపుచ్చిన కూడబెట్టుకొనవ
చ్చునుగాని, కాలము వ్యర్థపుచ్చిన కూడబెట్టు
కొనలేము. (శ్రీచైతన్యమహాప్రభు)

101 క్షేత్ర పవిత్రతకంటె హృదయపారిశుద్ధ్యమే
ముఖ్యము. (కబీరుదాసు)

102 భగవంతుడొక్కడే పురుషుడు. తక్కినవారెల్ల
న్నియు స్త్రీసమములే. (మీరాబాయి)

103 భగవంతునితో తగవులాడియైనను భక్తిని
సంపాదింపుము. (రామప్రసాద్ సేన్)

104 రాజాధిరాజుల కానుకలనైన నిరాకరించి
యపరిగ్రహవ్రతము నిర్వహించుకొనుము. (తుకారామ్)

105 అతి దారుణ పాపమునకునైత మాత్మవి
శ్వాసమే పరమౌషధము. (గిరీశచంద్ర ఘోష్)

106 సర్వస్వమును గురుపాదములకర్పింపుము. (శివాజీ)

107 ఎన్ని కష్టములు వచ్చినను సహించుకొని
స్వాతంత్ర్యమును గాపాడుము. (రాణాప్రతాప్)

108 నదీనద తటాకములు జలపూర్ణములైనను
చాతకము మేఘమువంకకే చూచుచుండు
నట్లు భక్తుడు భగవదనుగ్రహము మీదనే
యాధారపడునుగాని యితరము నొల్లడు. (తులసీదాస్)

ఓం శాంతి శ్శాంతి శ్శాన్తిః

*For Copies apply to :*

**Sri Atmananda Brahmachari**
ATMANANDA ASRAMAM
(Post) **PALASA**
**(District) Srikakulam**
**ANDHRA PRADESH.**

వలయువారు :

**శ్రీ ఆత్మానంద బ్రహ్మచారి**
ఆత్మానందాశ్రమము
(పోష్టు) పలాస
(జిల్లా) శ్రీకాకుళమ్ (ఆంధ్రప్రదేశ్)

మా పుస్తకములు ఈ దిగువ చోటులలో కూడ దొరకును :—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
బుక్ సెల్లర్సు & పబ్లిషర్సు, రాజమండ్రి.

కాతు బుక్కు డిపో
బుక్ సెల్లర్సు, రాజమండ్రి.

కారుమూరి చినవీరాస్వామి
మెయిన్ రోడ్డు, రాజమండ్రి.